# ఆంధ్రప్రదేశ్ గురించి

* 1971 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 7.93 శాతానికి. ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.

* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2,75,109 చ. కి. మీటర్లు.

* 1971 లో సేకరించిన లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా 4,33,94,951 మంది. దేశ జనాభా 54,69,55,945.

* 1971 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 24.56 శాతం మంది వున్నారు. 1961 లో 21.19 శాతం. భారతదేశం మొత్తం మీద వున్న అక్షరాస్యుల శాతం 1971 లో 29.35. 1961 లో 24.03 శాతం.

* మన రాష్ట్రంలో జనాభా సాంద్రత చ. కి. మీ. 1 కి 157 మంది. హైదరాబాదు జిల్లాలో సాంద్రత చ. కి. మీ. 1 కి 362. అన్ని జిల్లాల కంటే యిది ఎక్కువ. ఆదిలాబాద్ జిల్లాలో జనాభా సాంద్రత 79 మంది. అన్నిటికంటే యిది తక్కువ.

* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. 281 లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306 లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333 ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.

* రాష్ట్రంలో 1,000 అడుగులలోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2,000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

* భారతదేశంలో, బొరైట్స్ ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం దేశంలో ఉత్పత్తి అయ్యే బొరైట్స్‌లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది.

* అభ్రకం ఉత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాత స్థానం ఆంధ్రప్రదేశ్ ది.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 18

ఫిబ్రవరి 1974
మాఘ—ఫాల్గుణ, 1895 శా. శ.

సంచిక : 4

ప్రధాన సంపాదకులు
పెండ్యాల వామనరావు

సంపాదకులు :
భండారు పర్వతాలరావు



దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

మూడవ అట్ట : పెంపుడు బిడ్డ

చివరి అట్ట : నౌబత్ పహాడ్ మీద దేవాలయం

సాలు చందా : ఆరు రూపాయలు

**వెల: 50 పైసలు**

రిజిస్టరు నెం : H/HD–81




పేజీ

# యువజన శక్తి సక్రమ వినియోగం

ప్రజాస్వామ్యంలో యువజన శక్తికిగల ప్రాముఖ్యతను తక్కువ అంచనా వేయడానికి వీల్లేదు. యువజనుల కార్యకలాపాలకు ప్రోత్సాహాన్నిచ్చి, వాటిని నిర్వహించవలసిన అవసరాన్ని గుర్తించిన కారణంగానే ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక డైరక్టరు అజమాయిషీ క్రింద యువజన సేవల శాఖను ఒకదానిని ఏర్పాటు చేసింది. యువజన సంక్షేమం అన్నమాటకు చాలా విపులార్థం వుంది. అనేక రకాల కార్యకలాపాలకు యిది విస్తరించి వుంది. అప్పుడప్పుడు యువకుల్లో నుండి బయటవచ్చే క్రమశిక్షణా రాహిత్యానికి ప్రధాన కారణం వారి మానసిక అశాంతి అనే చెప్పాలి. అంతేకాదు. యువతీ యువకులకు తమ భవిష్యత్తు అస్పష్టంగా కనిపించడం కూడా ఒక కారణమే. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత చదువుకొన్న యువజనుల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఉద్యోగావకాశాలను ఎంత బహుళంగా విస్తృతీకరించినా యింకా అనేకమంది నిరుద్యోగులుగా వుండిపోవడం మనం చూస్తూనేవున్నాం.

ఈ పరిస్థితిని ఎదుర్కొనే ఉద్దేశంతో చదువుకున్న యువజనుల నిమిత్తం ప్రత్యేక ఉపాధికల్పనా పథకాలను ప్రారంభించడం జరిగింది. ఒక తరహా వ్యవస్థనుంచి మరో తరహా వ్యవస్థకు మార్పు చెందుతూన్నప్పుడు అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలో కష్టాలు ఎదురవడం అసహజమేమీకాదు. యువతీయువకుల్లో అశాంతికి యిదికూడా ఒక కారణమనే చెప్పాలి. ఈ నాటి యువజనులు తమ తల్లిదండ్రులకన్నా తెలివైనవారు. వీరి అభిరుచులు, వీరు సాధించిన విజయాలు కూడా వెనకటి తరం వారికంటే చాలవరకు భిన్నంగానే వున్నాయి. తమకు నచ్చిన రంగంలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించగల ప్రతిభావ్యుత్పత్తులన్నీ వీరికున్నాయి. అయితే ఆ ప్రతిభావ్యుత్పత్తులు సమగ్రంగా ఆవిష్కరింపబడకుండా అడుగంటుతున్నవేమిటి? బహుశా అవి సక్రమమైన కృషి, సరైన కార్య నిమగ్నత లేకపోవడమే. అంతేకాదు, యువజనులకు కావలసిన మార్గదర్శకత్వం లభించకపోవడం వల్లకూడా ఆ ప్రతిభావ్యుత్పత్తులు వెలుగులోకి రాలేక చీకటిలో కూరుకుపోతున్నాయి. యువజనుల శక్తిని సక్రమంగా వినియోగించుకోకపోవడంవల్ల ఆ శక్తి అనేక రూపాల్లో బైటికి పొర్లిపోతూ వుంటుంది. అలా పొర్లిపోవడంలో అప్పుడప్పుడు అది పక్కదార్లు కూడా పట్టడం కద్దు. అందుచేత యువకులు తమ శక్తియుక్తులను పూర్తిగా సక్రమ పంథాలో ప్రకటించుకోడానికి వారికి వివిధ మార్గాలను మనం కల్పించడం చాలా అవసరం.

యువజనులు వారి విషయము వారే చూసుకొంటారని వదలివేయక, వారికి యివ్వవలసినంత స్వేచ్ఛ యిస్తూ, వారి చదువు సంధ్యల అభివృద్ధికి ఉపాధ్యాయులూ, తల్లిదండ్రులూ, విద్యాసంస్థల యాజమాన్యంవారూ, అందరూ తగిన శ్రద్ధ వహించాలి. విద్యస్థాయిని పెంచడం చాలా అవసరం. కళాశాల, పాఠశాల ఆవరణల్లో యువజనులు వున్నంతసేపూ తీరిక లేకుండా ఏదో ఒక పనిని వారికి కల్పించాలి. సక్రమమైన పౌరులుగా, క్రమశిక్షణగల వ్యక్తులుగా రూపొందడానికి దోహదంచేయని ఏ చర్యలలోనూ పాల్గొనే తీరికకు తావుయివ్వని అభిరుచుల, కార్యకలాపాలతో యువజనులకు పూర్తిగా పని కల్పించాలి.

జాతీయ ఆస్తులనేవి ప్రజలనుంచి వసూలుచేసే పన్నులతో నిర్మింపబడతాయి గనుక ఆ జాతీయ ఆస్తులను కాపాడడంలో చురుకుగా పాల్గొనేందుకు యువజనులకు మొదటినుంచీ కూడా వాటి ప్రాముఖ్యాన్నీ, పవిత్రతలను గూర్చి నేర్పాలి. ప్రభుత్వ ఆస్తిపాస్తులకు ఏవిధమైన నష్టం వాటిల్లినా అది ప్రజలకే నష్టం. ఆ ప్రజల్లో యువజనులుకూడా వున్నారు గనుక అది వారికీ నష్టమే. ఈ సత్యాన్ని ప్రజలు—యువజనులు కూడా—సరిగా గుర్తించలేదని అనడంలేదు. కాని, ఆవేశాలు పెచ్చుపెరిగి వున్నప్పుడు యీ విషయాన్ని విస్మరించడం జరుగుతోంది. ఇందువల్లనే ఏ ఆందోళనలోనయినా అంత తీవ్రమైన విధ్వంసన కానవస్తూ వుంటుంది. యువజనుల్లో ఎక్కువగావుండే శక్తియుక్తులను ప్రదర్శించుకొనే మార్గాలు వుండాలి. అవి లేనప్పుడు యువజనుల సమస్యలు మనల్ని ఎప్పుడూ చుట్టుముట్టి కలవర పెడుతూనే వుంటాయి.

—పి. వి. ఆర్.

# రాష్ట్ర చరిత్రలో నూతనాధ్యాయం

( ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు నూతన సంవత్సర సందర్భంగా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి డిసెంబరు 31 వ తేదీ సాయంత్రం గం 7-45 లకు రాష్ట్ర ప్రజలను ఉద్దేశించి చేసిన రేడియో ప్రసంగం )



ముందున్నవి మంచి రోజులన్నట్టుగా కొత్త సంవత్సరం మీద కొండంత ఆశతో ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నూతన సంవత్సరం ఆరంభమౌతున్నది. రాష్ట్ర ప్రజలకు యీ కొత్త సంవత్సరం ఆనందదాయకంగా, ఐశ్వర్య వికాసంగా వుండాలని యీ సమయంలో నా హృదయపూర్వక శుభాకాంక్షల్ని అందజేస్తున్నాను.

గత అయిదేళ్ళలోనూ ఆంధ్రప్రదేశ్ అనేక అసాధారణ పరిస్థితుల్ని ఎదుర్కొంటూ కష్టకాలం గడపవలసివచ్చింది. ఈ అయిదేళ్ళలోనూ మూడు సంవత్సరాలు తీవ్రమైన కరువు ఏర్పడింది రెండుసార్లు పెద్ద పెద్ద తుఫానులు వచ్చాయి. ఇవికాక రెండుసార్లు రాష్ట్రంలో తలెత్తిన ఆందోళనలు రాష్ట్రాన్ని కదిలించివేశాయి. భాషాప్రాతిపదిక మీద ఏర్పడిన రాష్ట్ర సమైక్యతా సిద్ధాంతానికే గొడ్డలిపెట్టుగా యీ ఆందోళనలు తయారయ్యాయి మన ప్రగతిని కుంటుపరిచాయి.

తెలుగు ప్రజల ఒకేచరిత్ర, ఒకే భవిష్యత్తు అనే బలమైన పునాదులమీద ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటైంది ఈ రాష్ట్రం చాలా సువిశాలమైనది. ఇక్కడ వనరులు సమృద్ధిగా వున్నాయి వీటన్నిటినీ దృఢ చిత్తంతో, సక్రమ మార్గంలో పూర్తిగా వినియోగించుకొన్నప్పుడు యీ రాష్ట్రం ఒక పటిష్ఠమైన, ఐశ్వర్యవంతమైన రాష్ట్రంగా రూపొందగలదు. మనమధ్యగల స్పర్థలవల్ల ప్రగతి గమనం కుంటు పడడమే గాక సమైక్యరాష్ట్రమనుగడకే ముప్పు వాటిల్లింది. అయితే యిది తాత్కాలికం మాత్రమే. మనసంక్షేమమూ, మన భవిష్యత్తూ నాలుగున్నరకోట్ల తెలుగు ప్రజల సమైక్యత మీదనే ఆధారపడివున్నదని తర్వాత జరిగిన సంఘటనలు పూర్తిగా రుజువుచేశాయి

ప్రధానమంత్రి చొరవవల్లా, ఇరుప్రాంతాలకు చెందిన నాయకులుచూపిన దూరదృష్టివల్లా, ప్రజల విజ్ఞతవల్లా సుదీర్ఘమైన చర్చల అనంతరం ఆరు అంశాల పథకం రూపొందించబడింది. ఈ పథకానికి ప్రజల ఆమోదమూ, పార్లమెంటు అంగీకారమూ లభించాయి. తెలుగు మాట్లాడే ప్రజల ఐక్యతను, భావసమైక్యతను పటిష్టంచేసి, భవిష్యత్తులో ఎప్పుడూకూడా ఆంధ్రప్రదేశ్ సమైక్యతకు భంగం వాటిల్లకుండా ఏకరాష్ట్రంగా కొనసాగేట్టుచేయడానికి దోహదం చేసేవిధంగా వుంది యీ పథకం, లోగడ నేను పేర్కొన్నట్లుగా ప్రజలకు యిచ్చినవాగ్దానాల్ని నెరవేర్చి, నిష్కళంకమైనదీ, నిజాయితీగలదీ అభ్యుదయకరమైనదీ అయిన సంక్షేమ ప్రభుత్వాన్ని ప్రజలకు అందించడానికి నిరంతరంగా, చిత్తశుద్ధితో లక్ష్యసాధనకు పూర్తిగా అంకితమై కృషిచేయగలను.

ప్రజలకు యిచ్చిన వాగ్దానాల్ని అమలుపరచవలసివుంది. ఎవరిమీదా ద్వేషానికి తావు లేదు రాష్ట్ర ప్రజల సంక్షేమాన్నీ, రాష్ట్ర భవితవ్యాన్నీ దృష్టిలో వుంచుకుని నిజాయితీతో సహకరిస్తూ ప్రతి ఒక్కరూ బాధ్యతలను పంచుకోవాలి.

నా మీద విశ్వాసాన్నివుంచినందుకు ప్రధాన మంత్రికీ, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు నేను కృతజ్ఞుడను. రాష్ట్ర సమగ్రతను పరిరక్షించడానికి నిరంతరంగా పరిశ్రమిస్తూ, ఇరుప్రాంతాల ప్రజలకు వీలయినంత ఎక్కువ సంతృప్తిని కలిగిస్తూ ప్రజలూ, ప్రియతమ ప్రధానీ ఆశించిన విధంగాశక్తివంచనలేకుండా చేయడానికి చిత్తశుద్ధితో కృషిచేస్తాను. ఇరుప్రాంతాల ప్రజలు, వారి ఆశలతో నాకు సమానంగా పరిచయముంది. నా కృషికి యిది ఎంతగానో తోడ్పడుతుంది. తెలుగు ప్రజల సమైక్యతమీదా, సమగ్రతమీదా అపారమైన విశ్వాసం నాకు వుంది. ఎంతో క్లిష్టమైన పరీక్షా సమయాలలో కూడా నేను యీ విశ్వాసాన్ని వదులుకోలేదు. ఒక దేశచరిత్రలోగానీ ఒక రాష్ట్ర చరిత్రలోగానీ రాజకీయమైన యిబ్బందులో, పరిపాలనా సంబంధమైన యిబ్బందులో తీవ్రరూపాన్ని ధరించి ఏ అగ్ని పర్వతంలాగో ప్రేలి పొగలూ సెగలూ కక్కడం అసహజమేమీ కాదు. అయితే ఆలోచనాశీలురూ, కార్యదక్షులూ అయిన నాయకులువున్నచోట యీ విధమైన ఆందోళనలు తాత్కాలికమైనవేననీ, కేవలం సంధికాలంలో సంభవించిన అశాశ్వతమైన చర్యలేననీ నిరూపితమయ్యాయి. ప్రజల అవసరాలకు, ఆశలకు తగినట్టుగా వనరులు వినియోగంలో లేని ఏ అభివృద్ధి చెందుతున్న రాష్ట్రంలో నయినా ఏదో ఒక విధమైన అసంతృప్తి తప్పని సరి. అయితే యిటువంటి దానిని చాకచక్యంతోనూ సమర్థతతోనూ పరిష్కరించుకోవలసివుంటుంది.

విచ్ఛిన్నకర కార్యాలు వేర్పాటు ధోరణులు రాష్ట్ర సుస్థిరతకే కాక ప్రజల సంక్షేమానికీ, అభ్యుదయానికీ కూడా ప్రమాదకరమైనవని మొత్తం మీద ప్రజలు గుర్తించినందుకు నాకెంతైనా ఆనందంగా వుంది. ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు విజ్ఞులు. ఈ విజ్ఞతే రాష్ట్రం విచ్ఛిన్నం కాకుండా కాపాడింది.

ఆరు అంశాల పథకాన్ని తు.చ. తప్పకుండా అమలుపరచడానికి నిజాయితీతో కృషిచేయగలనని నేను హామీయిస్తున్నాను. సమాజంలోని అన్నివర్గాలవారి, అన్ని రాజకీయ పార్టీలవారి, భిన్నభిన్న అభిప్రాయాల వారి హృదయ పూర్వకమైన సహకారాన్ని ఒక మాటలో చెప్పాలంటే మొత్తం ప్రజలందరి హృదయపూర్వక సహకారాన్ని కోరుతున్నాను. ప్రజలకు ఉపాధి కల్పించడం, దారిద్ర్యాన్ని నిర్మూలించడం, సాంఘిక సేవా కార్యక్రమాలను మెరుగు పరచడం—యివి చాలా ముఖ్యమైనవని నేను భావిస్తున్నాను. క్రిమాను గతమైన పారిశ్రామికీకరణ లేనిదే రాష్ట్రంలోనిరుద్యోగసమస్యపరిష్కారంకాదు. భూ సంస్కరణలను సక్రమంగానూ, ఖచ్చితంగానూ అమలు పరచనిదే వ్యవసాయ ఆదాయం ఎక్కువకాదు. యీ రెండు కార్యక్రమాలను శీఘ్రంగా అమలుపరచడానికే నేను గట్టిగా కృషిచేస్తాను. ప్రజాస్వామ్యం, మతరహిత వ్యవస్థ, ప్రణాళికా రచన—యీ మూడు మూడు స్తంభాలు. దీని మీదే మన జాతీయ సౌధం నిలిచివుంది. సోషలిజం మన జాతీయ లక్ష్యం.

పత్రికా స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం మన జాతీయ విధానంలో ముఖ్యాంశాలు. ఈ లక్ష్యాలు మనలను నిరంతరంగా ముందు నడిపించే నడవడంలో ఎలాటి సందేహము లేదు. ఆంధ్రప్రదేశ్ సార్వజనీన రాష్ట్రం. అల్ప సంఖ్యాక భాషా వర్గాలవారి విషయంలోనూ, అల్ప సంఖ్యాక మతఅనుయాయుల విషయంలోనూ ఉదారమైన విధానం గల రాష్ట్రమిది. మనం అనుసరించే భాషా విధానం చాలావాస్తవికదృక్పథంతో కూడుకున్నది. ఉర్దూ భాషకు యిక్కడ సముచిత స్థానం వుంది. ఈ ఆరోగ్యవంతమైన విధానాలను కొనసాగించడమేగాక వీటిని సక్రమంగానూ శక్తివంతంగానూ అమలు చేయడంలో ఎదురయ్యే అడ్డంకులను తొలగించడానికి కూడా నేను కృషిచేస్తాను. తెలుగు భాషా, తెలుగు సంస్కృతి మనలను ఒక్కత్రాటితో బంధించాయి. ఇవే మనరాష్ట్రం ముక్కచెక్కలు కాకుండా రెండుసార్లూ నిరోధించాయి. అందువల్ల తెలుగు భాష వాడుకను ఎక్కువచేసి దీని అభివృద్ధికి తగిన చర్యలు తీసుకోవడం నా కర్తవ్యం.

తెలుగులో ప్రసంగించడంద్వారా యిందుకు శ్రీకారం చుట్టాను. శాసనసభలో తెలుగులో మాత్రమే నేనుసమాధానాలివ్వాలని అనుకుంటున్నాను. తెలుగు భాష తెలుగు ప్రజల మాతృభాష. అందువల్ల ఆ భాషలో మాట్లాడితేనే వారి హృదయాలకు సన్నిహితంగా పోగలం.

మనకున్న మంచిపేరుకు మబ్బులా పట్టిన గతసంఘటనలను మరిచిపోయి, నిర్మాణాత్మకమైన ఆలోచనల వైపు తమ దృష్టిని కేంద్రీకరించి సమైక్యలకు, సదవగాహనకు సరికొత్త బంధాలు ముడివేసి వెనుకబడివున్న మనరాష్ట్ర ప్రగతికి తమ శక్తియుక్తులను సమాయత్తం చేయవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు చిత్తశుద్ధితో నేను విజ్ఞప్తిచేస్తున్నాను.

మనం ఎన్నో వాగ్దానాలను నిలబెట్టుకోవాల్సి వుంది. మనం ప్రయాణించవలసిన మార్గం సుదీర్ఘమైనదీ క్లిష్టమైనది కూడా. అడుగడుగున ఎన్నో అడ్డుకుంటున్నాయి. ప్రజలు సహృదయంతో చిత్తశుద్ధితో సహకరించితే యీ అడ్డంకుల్ని అధిగమించి రాష్ట్రచరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించగలమనడంలో సందేహంలేదు.

ఆంధ్రప్రదేశ్ సమగ్రతా పరిరక్షణ ప్రజల మధ్య భావ సమైక్యత – వివిధ రంగాలలో ముఖ్యంగా పారిశ్రామిక వ్యవసాయరంగాలలో సత్వరాభివృద్ధి అనే రెండు లక్ష్యాలను సాధిస్తూపురోగమిస్తామనడంలో నాకెట్టి సందేహంలేదు పరిమితంగా ఉన్న ప్రభుత్వ ఉద్యోగాల వల్లగాక పై వాటి ద్వారానే నిరుద్యోగాన్ని తగ్గించడానికి దోహదం కలుగుతుంది.

ఈ కొత్త సంవత్సరం, ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకు నూతన శకాన్ని ప్రారంభిస్తూ, సమైక్యతను పటిష్ఠంచేస్తూ వారికి సుఖ సంతోషాలను కలిగించాలని కోరుతున్నాను.

## ఆరు సూత్రాల పథకం

" తెలుగు మాట్లాడే ప్రజల ఐక్యతను, భావసమైక్యతనూ పటిష్ఠంచేసి భవిష్యత్తులో ఎప్పుడుకూడ ఆంధ్ర ప్రదేశ్ సమైక్యతకు భంగం వాటిల్లకుండా ఏక రాష్ట్రంగా కొనసాగేట్టుచేయడానికి దోహదం చేసే విధంగావున్నది యీ పథకం "



## శ్రీ భాట్టం శ్రీరామమూర్తి

శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు 1926 మే నెలలో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి పట్టభద్రులయ్యారు. ఆటు తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి న్యాయశాస్త్రంలో పట్టాపొందారు. మొదట వీరు కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో సభ్యులుగా చేరారు. ఆటు తర్వాత విశాఖపట్టణంలో సోషలిస్టుపార్టీని స్థాపించారు. రాష్ట్ర సోషలిస్టుపార్టీకి వీరు సంయుక్త కార్యదర్శిగా వ్యవహరించారు. కొంతకాలంపాటు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ హోదా వీరు సంయుక్త కార్యదర్శిగా వున్నారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం అడ్‌హాక్ కమిటీ కార్యదర్శిగా పనిచేశారు.

శ్రీ శ్రీరామమూర్తిగారు పాత్రికేయులు. వీరు 1947లో జయభారతి పత్రిక సంపాదక వర్గంలో చేరి పనిచేశారు. విజయనగరం నియోజకవర్గం నుంచి 1957–1967 మధ్యకాలంలో రాష్ట్రశాసనసభ సభ్యులుగా వున్నారు. గత సాధారణ ఎన్నికలలో పరవాడ నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నికయ్యారు. విశాఖపట్నం నుంచి ప్రచురించే 'ప్రజారథం' అనే పత్రికకు వీరు సంపాదకులుగా వుండేవారు. కాంగ్రెసు సంస్థ ప్రచురించే దినపత్రిక 'ఆంధ్రజనత'కు సంపాదకులుగా పనిచేశారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీకి సంబంధించిన సాంస్కృతిక విభాగాన్ని నిర్వహించారు. శ్రీ రామమూర్తిగారు మంచి వక్త, రచయిత. ఆరు పుస్తకాల్ని ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామోద్యోగ మండలి అధ్యక్షులుగా పనిచేశారు. 1972 సాధారణ ఎన్నికల తర్వాత ఏర్పాటైన నరసింహారావు మంత్రివర్గంలో సహాయమంత్రిగా వుండి విద్య, సాంస్కృతిక విషయాలశాఖలను నిర్వహించారు.

---

# ఈ సంచికలోని రచయితలు

శ్రీ జె. వెంగళరావు, ముఖ్య మంత్రి, ఆంధ్రప్రదేశ్.

శ్రీ పి. వామనరావు, డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ, హైదరాబాదు.

శ్రీ ఎదిరె చెన్నకేశవులు, 1–2–739, రామకోట, హైదరాబాదు.

శ్రీ వింజమూరి శివరామారావు, రాదేపల్లివారి వీధి, సూర్యారావుపేట, విజయవాడ–2.

డా॥ బి.ఆర్.కె. రావు, ఎకనామిక్స్ డిపార్టుమెంట్, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, చిత్తూరు జిల్లా.

శ్రీ గుంటి పుండరీకాక్షయ్య, శ్రీవెంకటేశ్వర గుంటూరు చేనేత వస్త్రాలయం, శ్రీకాకుళం.

శ్రీ తిప్పగుంటల లక్ష్మణశాస్త్రి, 69, అదిక్మెట్, హైదరాబాదు.

శ్రీమతి వేదవతీదేవి, "గోకుల్", 12–2–826/ఎ/15, ఎల్ ఐ సి. కాలనీ, మెహదీపట్నం హైదరాబాద్–28.

శ్రీ ఎస్.వై. హుసేన్, బి.ఎ.బి.ఆర్.డి.,పి. గన్నవరం, తూ.గో. జిల్లా.

శ్రీ ఎ. పండరీనాథ్, టీచర్, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, ఇబ్రహీంపట్నం, హైదరాబాద్ జిల్లా

శ్రీ ఆర్.ఆర్. రావు, ఫీల్డ్ పబ్లిసిటీ ఆఫీసర్, నల్గొండ

శ్రీ టి.వి. రామమూర్తి, 177/2ఆర్.టి, విజయనగర్ కాలనీ, హైదరాబాదు.

శ్రీ ఎస్. ఆర్. కోటేశ్వరశాస్త్రి, డివిజనల్ ఆఫీస్, ఎల్.ఐ.సి. ఆఫ్ ఇండియా, హైదరాబాదు–1

శ్రీమతి కోట సుశీలాదేవి, 3–1526/12, లక్ష్మీపురా, హైదరాబాదు.

శ్రీ దేవిప్రియ, c/o శ్రీ కె. శివారెడ్డి, 6–1–711, ఖైరతాబాద్, హైదరాబాదు–4.

# చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి

సినిమా అనేది చాలా శక్తివంతమైన ప్రచార సాధనం. దేశమంతటా శాఖోపశాఖలుగా విస్తరించివున్న సినిమా హాళ్ళ ద్వారా ప్రదర్శింపబడుతున్న కథా చిత్రాలు ప్రజలకు వినోదాన్ని కలిగించడమే కాక ప్రజల వేషభాషల మీదా, ఆచార వ్యవహారాలమీదా చెరిగిపోని ముద్ర వేస్తుంటాయి. అంతేకాదు, కొన్నిటివల్ల సందేశాలు కూడ ప్రజల్ని చేరుతూవుంటాయి హిందీ మాతృభాషకాని ప్రాంతాలలో ప్రదర్శింపబడే హిందీ చిత్రాలవల్ల హిందీభాషను అవగాహన చేసుకొనడానికి వీలు ఏర్పడుతుంది.

తెలుగు చలనచిత్రాల నిర్మాణానికి హైదరాబాదును కేంద్రంగా చేసేవుద్దేశంతో ఆంధ్ర ప్రభుత్వం గత కొన్నేళ్ళుగా రాష్ట్రంలో చలనచిత్రపరిశ్రమ అభివృద్ధికి కొన్ని నిర్దిష్టమైన చర్యలు తీసుకుంది. ఆ పరిశ్రమ కారణంగా చాలమందికి ఉపాధి సౌకర్యం లభించడం, యింకా అనేక విధాలుగా ప్రభుత్వానికి లాభం చేకూరడం వంటి మేలు జరుగుతుంది గనుక రాష్ట్ర రాజధానిలో తెలుగు చిత్రాల్నిగాని, హిందీ చిత్రాల్నిగాని, మరి ఏ యితర భాషా చిత్రాల్నిగాని తీయడాన్ని ప్రోత్సహిస్తే బావుంటుందని 1963లోనే రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఆంధ్రప్రదేశ్‌లో తీసిన ప్రతి చిత్రానికీ, అది ఏ భాషా చిత్రమైనా సరే– రూ.50 వేల చొప్పున సబ్సిడీ ఇవ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది. తెలుగు చిత్ర నిర్మాతలేగాక హిందీ, మరాఠీచిత్ర నిర్మాతలు కూడా ఆంధ్రప్రదేశ్‌లో సినిమాలు తీయడానికి యీసబ్సిడీ ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించినదనడంలో ఏలాంటి సందేహమూ లేదు. రాష్ట్రంలో చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందడానికి అనువైన వాతావరణాన్ని కలిగించడంలో కూడా యీ సబ్సిడీ విశేషంగా తోడ్పడింది.

పి. వి. ఆర్.

అయితే ఇటీవల ఇక్కడ తయారవుతున్న సినిమాల సంఖ్య అనుకున్నంతగా ఎక్కువ కాక పోవడానికి కారణం గత నాలుగైదు సంవత్సరాలుగా రాష్ట్రంలో ఏర్పడి వున్న అనిశ్చిత పరిస్థితులే అనవచ్చు. మొదట్లో కొంత కాలంపాటు మాత్రమే సబ్సిడీ ఇవ్వాలని ఉద్దేశించినప్పటికీ హైదరాబాదుకు చలన చిత్ర పరిశ్రమను రప్పించడంలో యీ సబ్సిడీ పథకం ప్రధానమైన ఆకర్షణగా వ్యవహరిస్తున్న దృష్ట్యా యీ పథకాన్ని అటు తరువాత కూడా ప్రభుత్వం యింకా కొనసాగిస్తూనే వుంది. సబ్సిడీ అనేది కేవలం ఒక ప్రోత్సాహకారి మాత్రమే. అంతే గాని సినిమా తీయడానికి అయ్యే ఖర్చు యావత్తూ భరించే వుద్దేశంతో యిది ఏర్పాటు చేసినది కాదు. ఇంతవరకు 40 చలన చిత్రాలకు సబ్సిడీ యివ్వడం జరిగింది.

రాష్ట్రంలో తీసిన సినిమాలకు సబ్సిడీ ఇవ్వడమే కాక 'బ్రహ్మానంద చిత్రపురి' అనే చలన చిత్ర ప్రాంతాన్ని ఒక దానిని నెలకొల్పే పథకాన్ని కూడా రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. కొత్త స్టుడియోలను, తదనుబంధ నిర్మాణాలను, యిళ్లు, కాలనీలను నిర్మించే ఉద్దేశంతో హైదరాబాదు–విజయవాడ రోడ్డులో హయత్‌నగర్ వద్ద 200 ఎకరాలను కేటాయించడం జరిగింది. ఇక్కడి స్థలాలను చలన చిత్ర పరిశ్రమ నిమిత్తం డబ్బు చెల్లింపు పద్ధతిలో ఆ పరిశ్రమలోని వారికి కేటాయిస్తున్నారు. విద్యుచ్ఛక్తి, టెలిఫోను, నీటి సరఫరావంటి ప్రాతిపదిక సౌకర్యాలను ప్రభుత్వం యిప్పటికే కల్పించింది. ఇలా చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి పునాది సంబారాలను ప్రభుత్వం కల్పించింది. ఇక దీనిని వినియోగించుకునే బాధ్యత చలనచిత్ర పరిశ్రమలోని వారిది. ముందుకు వచ్చి, స్టూడియోలను నిర్మించుకొనేందుకు అనువైన స్థలాన్ని కేటాయించమని అడగవలసినది వారే, అప్పుడే ప్రముఖ చలన చిత్ర నిర్మాతలు యిద్దరికి చెరొక 20 ఎకరాల చొప్పునా, మరొక నిర్మాతకు 10 ఎకరాలూ కేటాయించడం జరిగింది. ఉన్న స్టూడియోలను విస్తృత పరచడానికి, కొత్త స్టూడియోలను నిర్మించడానికీ ఋణాలను కూడా ఇవ్వడం జరిగింది.

## ఉత్తమ చిత్రాలకు బహుమతులు

సాంస్కృతికమైన, విద్యావిషయికమైన విలువలతో ఉన్నతమైన సాంకేతిక, కళాత్మక ప్రమాణాలుగల తెలుగు చలన చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించే వుద్దేశంతో రాష్ట్రప్రభుత్వం మరికొన్ని చర్యలు తీసుకుంది. ప్రతియేటా తెలుగులో తీసే ఉత్తమ చిత్రాలకు బహుమతుల్ని యిచ్చేపద్ధతిని ప్రభుత్వం ప్రారంభించింది. రాష్ట్రంలో అభివృద్ధి చెందుతున్న చలన చిత్ర పరిశ్రమకు అవసరమయ్యే సుశిక్షితులైన యోగ్యత గల వ్యక్తులను లభింపచేసే వుద్దేశంతో పూనాలోని ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా వారు మనకు కల్పిస్తున్న సౌకర్యాలను రాష్ట్ర ప్రభుత్వం పూర్తిగా వినియోగించుకుంటోంది. ఆ సంస్థలో వివిధ కోర్సులలో చదువుకొనడానికి ఆంధ్రప్రదేశ్ నుంచి వెళ్ళే విద్యార్థులకు ఉపకార వేతనాలను కూడా ఏర్పాటు చేయడం జరిగింది. ఇంతవరకు 21 మంది విద్యార్థులు ఆవిధమైన ఉపకారవేతనాన్ని పొందారు. అవుట్ డోర్ షూటింగ్‌కు ఆయా ప్రభుత్వ శాఖలు వసూలు చేసే చార్జీలను చాలా వరకు తగ్గించడం జరిగింది. బాలల నిమిత్తం ప్రత్యేకంగా ఒక థియేటరును నెలకొల్పాలని ప్రభుత్వం ఉద్దేశిస్తోంది. చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన ఆ యా కార్యక్రమాలను చేపట్టే నిమిత్తం వినోదపు పన్ను నుంచి ప్రత్యేకంగా చలన చిత్ర అభివృద్ధి నిధి అని కొంత మొత్తాన్ని కేటాయించడం

(తరువాయి 10 వ పేజీలో)

# రాష్ట్రంలో ప్రణాళిక, అభివృద్ధి సంఘాలు

1971 జనవరి 1వ తేదీనుంచి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు వేరు వేరు ప్రణాళిక, అభివృద్ధి సంఘాలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. తెలంగాణా తొమ్మిది జిల్లాలకు ఒక సంఘం, రాయలసీమ నాలుగు జిల్లాలకు ఒక సంఘం, కోస్తా ఆంధ్రలోని ఏడు జిల్లాలకు ఒక సంఘము ఏర్పాటు చేయబడినవి. ఆ ప్రాంతాలకు చెందిన వారిని ఆయా సంఘాలలో సభ్యులుగా ప్రభుత్వం నియమించింది. వీరి వివరాలను ఈ క్రింద ఇస్తున్నాము.

## 1. తెలంగాణా ప్రణాళిక అభివృద్ధి సంఘం

శ్రీ సి. జగన్నాథరావు, ఎం. ఎల్. ఎ.—అధ్యక్షులు

సభ్యులు :

1. శ్రీ పి. పుల్లారెడ్డి, ఎం. ఎల్. ఎ. గద్వాల
2. శ్రీ వి. ఎన్. గౌడ్, ఎం. ఎల్. ఎ. నాగర్‌కర్నూల్
3. శ్రీ కె. రంగదాస్, ఎం. ఎల్. ఎ. కొల్లాపూర్
4. శ్రీ ఎన్. అనంతరెడ్డి, ఎం. ఎల్. ఎ. ఇబ్రహీంపట్నం
5. శ్రీ పి. కిషన్‌రావు, ఎం. ఎల్. ఎ. చేవెళ్ళ
6. శ్రీ ఎం. బాగారెడ్డి, ఎం. ఎల్. ఎ. జహీరాబాదు
7. శ్రీ సి. రాజనరసింహ, ఎం. ఎల్. ఎ. ఆందోల్
8. శ్రీ ఎం. శ్రీనివాస్‌రావు, ఎం. ఎల్. ఎ. బన్స్‌వాడ
9. శ్రీ టి. రంగారెడ్డి, ఎం. ఎల్. ఎ. ఆర్మూరు
10. శ్రీ మసూద్ అహమ్మద్, ఎం. ఎల్. ఎ. ఆదిలాబాద్
11. శ్రీ గడ్డన్న, ఎం. ఎల్. ఎ. ముధోల్
12. శ్రీ వి. జగపతిరావు, ఎం. ఎల్. ఎ. జగిత్యాల
13. శ్రీ సి. ఎల్లారెడ్డి, ఎం. ఎల్. ఎ. ఇందుర్తి
14. శ్రీ టి. పురుషోత్తమరావు, ఎం. ఎల్. ఎ. వర్ధన్నపేట
15. శ్రీ పి. కె. లింగయ్య, ఎం. ఎల్. ఎ. చెరియాల్
16. శ్రీ మహమ్మద్ రజబ్ ఆలీ, ఎం. ఎల్. ఎ. ఖమ్మం
17. శ్రీ టి. వెంకటప్పయ్య, ఎం. ఎల్. సి.
18. శ్రీ ఎం. కమలమ్మ, ఎం. ఎల్. ఎ. నర్సాపూర్
19. శ్రీ పి. గోవర్ధన్‌రెడ్డి, ఎం. ఎల్. ఎ. మునుగోడు
20. శ్రీమతి జె. ఈశ్వరీబాయి, ఎం. ఎల్. ఎ. యెల్లారెడ్డి

## 2. రాయలసీమ ప్రణాళిక, అభివృద్ధి సంఘం

శ్రీ కె. బి. నరసప్ప, ఎం. ఎల్. ఎ.—అధ్యక్షులు

సభ్యులు :

1. శ్రీ పి. రాజరత్నరావు, ఎం. ఎల్. ఎ. ఆలూరు
2. శ్రీ హెచ్. సత్యనారాయణ, ఎం. ఎల్. ఎ. ఆదోని
3. శ్రీ కె. రహిమాన్ ఖాన్, ఎం. ఎల్. ఎ. కర్నూల్
4. శ్రీ అయ్యపురెడ్డి, ఎం. ఎల్. ఎ. పాణ్యం
5. శ్రీ బి. వెంకటరెడ్డి, ఎం. ఎల్. ఎ. నంద్యాల
6. శ్రీ బి. బసప్ప, ఎం. ఎల్. ఎ. ఉరవకొండ
7. శ్రీ చి. రంగారెడ్డి, ఎం. ఎల్. ఎ. సింగనమల
8. శ్రీ ఎ. వెంకటరెడ్డి, ఎం. ఎల్. ఎ. అనంతపూర్
9. శ్రీ పి. వి. చౌదరి, ఎం. ఎల్. ఎ. ధర్మవరం
10. శ్రీ ఎం. ఎల్లప్ప, ఎం. ఎల్. ఎ. మడకశిర
11. శ్రీ టి. శ్రీరాములు, ఎం. ఎల్. ఎ. కోడూరు
12. శ్రీ హబిబుల్లా మహల్, ఎం. ఎల్. ఎ. రాయచోటి
13. శ్రీ జి. రంగారెడ్డి, ఎం. ఎల్. ఎ. కడప
14. శ్రీ ఎస్. పి. నాగిరెడ్డి, ఎం. ఎల్. ఎ. మైదుకూరు
15. శ్రీ డి. సూర్యప్రకాశరెడ్డి, ఎం. ఎల్. సి.
16. శ్రీమతి టి. ఎన్. అనసూయమ్మ, ఎం. ఎల్. ఎ. తంబళపల్లి.
17. శ్రీ విజయ శిఖామణి, ఎం. ఎల్. ఎ. తిరుపతి
18. శ్రీ ఎ. నరసింగరావు, ఎం. ఎల్. ఎ. మదనపల్లి
19. శ్రీ సి. దాస్, ఎం. ఎల్. ఎ. సత్యవేడు
20. శ్రీ ఎన్. పి. వీరరాఘవులు, ఎం. ఎల్. సి.

## 3. కోస్తా ఆంధ్ర ప్రణాళిక, అభివృద్ధి సంఘం

శ్రీ దశరథరామరెడ్డి, ఎం. ఎల్. ఎ.—అధ్యక్షులు

సభ్యులు :

1. శ్రీ ఓ. వెంకట సుబ్బయ్య, ఎం. ఎల్. ఎ. వెంకటగిరి
2. శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి, ఎం. ఎల్. ఎ. గూడూరు
3. శ్రీ ఎం. నాసర్ బేగ్, ఎం. ఎల్. ఎ. మార్కాపురం
4. శ్రీ ఎ. కోటయ్య, ఎం. ఎల్. ఎ. సంతనూతలపాడు
5. శ్రీ ఎం. నాగిరెడ్డి, ఎం. ఎల్. ఎ. గురజాల
6. శ్రీ జి. వీరాంజనేయ శర్మ, ఎం. ఎల్. ఎ. సత్తెనపల్లి
7. శ్రీ ఎం. ఆర్. అప్పారావు, ఎం. ఎల్. ఎ. నూజివీడు
8. శ్రీ కె. రామయ్య, ఎం. ఎల్. ఎ. తిరువూరు
9. శ్రీ వై. వి. కృష్ణారావు, ఎం. ఎల్. సి.
10. శ్రీ డి. కోనేశ్వరరావు, ఎం. ఎల్. ఎ. చింతలపూడి
11. శ్రీ కె. రాములు, ఎం. ఎల్. ఎ. పోలవరం
12. శ్రీ కె. రామచంద్రరావు, ఎం. ఎల్. ఎ. బూరుగుపూడి.
13. శ్రీమతి ఎన్. విజయలక్ష్మి, ఎం. ఎల్. ఎ. తుని
14. శ్రీ వి. పాలవెల్లి, ఎం. ఎల్. ఎ. రౌతవరం
15. శ్రీ పి. సాంబశివరాజు, ఎం. ఎల్. ఎ. గజపతినగరం
16. శ్రీమతి బి. సరోజినమ్మ, ఎం. ఎల్. ఎ. నరసన్నపేట
17. శ్రీ సి. హెచ్. వి. కె. కృష్ణారావు, ఎం. ఎల్. ఎ., బొబ్బిలి.
18. శ్రీ పి. వెంకటరమణ, ఎం. ఎల్. ఎ. అనకాపల్లి
19. శ్రీ వి. నాగేశ్వరరావు, ఎం. ఎల్. ఎ. నందిగామ
20. శ్రీ పి. వెంకటరామయ్య, ఎం. ఎల్. ఎ. ఉదయగిరి

# వినిమయ దార్ల సహకార సంఘాల ఆవశ్యకత

శ్రీ ఎదిరె చెన్నకేశవులు

సహకారోద్యమం ఈనాడు సాంఘిక, ఆర్థిక, వ్యావహారిక, సాంస్కృతిక వివిధ రంగాలలో కాలిడి ప్రగతి పథంలో పయనిస్తోంది అనుటలో సందేహము లేదు. ఎందుకనగా భారత స్వాతంత్ర్యానంతరం, నవభారత నిర్మాణాన్ని సహకార పునాదులపై చేస్తూ, ఈ ఉద్యమాన్ని మానవుని జీవన విధానంగా మార్చుటకు కేంద్ర ప్రభుత్వం సర్వవిధముల సహకరిస్తోంది.

ప్రప్రథమమున మన దేశంలో ఈ ఉద్యమం రైతులకు తదితర చిన్న చిన్న వృత్తులవారికీ అప్పులు యిప్పించే పరపతి సహకార సంఘాలుగా ప్రారంభమైనది—ప్రభుత్వ ప్రోత్సాహంతోనే. కొన్ని సంస్థలు అభివృద్ధిని సాధించాయి. కొన్నిటిపై సరియైన అజమాయిషీ లేని కారణంగా పతనానికి దారితీశాయి.

స్వాతంత్ర్యానంతరం మనరాష్ట్రంలో సహకారోద్యమం ఉధృత రూపాన్ని దాల్చింది. వ్యవసాయదారులకు తమ భూములను సాగు చేసికొనుటకు, బావులు త్రవ్వుకొనుటకు, నీటివసరుల నిమిత్తం ఆయిల్ ఇంజన్లు, పంపుసెట్లు, తదితర వ్యవసాయాభివృద్ధి పథకాలకుగాను సహకార భూమి తనఖా బ్యాంకులద్వారా సరఫరా చేయించి, వారికెంతో దోహదం సమకూరుస్తోంది ప్రభుత్వం. ఆహారధాన్యాల అధికోత్పత్తికై ఈ సంస్థలు ఎంతో కృషిసల్పాయి. ఈనాడు సల్పుతున్నాయి కూడా.

మానవునిజీవిత నిత్యావసర వస్తువులను అధిక లాభాలు గడించే వ్యాపారస్థుల బారినుండి తప్పించి, చౌకధరలకు, వినియోగదారులకు సరఫరా చేయించుటకు వినిమయదారుల సహకారసంఘాలు నెలకొల్పబడినాయి. ఇలాంటి సహకార సంఘాలు మనదేశంలో నెలకొల్పబడక పూర్వమే విదేశాలలో అమల్లో ఉన్నాయి. వాటిద్వారా విదేశీయులు నిత్యావసర వస్తువులను తాము స్వయంగా ఉత్పత్తి చేయించి, తమ సభ్యులలో పంపకం చేసుకొనుటేగాక తదితర దేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నారు. వీరి వ్యాపారం రోజురోజుకు పెరిగి విస్తృత రూపం దాలుస్తోంది. మన దేశంలోకూడ రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆహార ధాన్యాలు, చక్కెర, కిరోసిన్ మొదలగు నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగి ప్రజలకు అందుబాటులో లేనికారణంగా ప్రభుత్వం వీటిపై కంట్రోలు విధించింది. అప్పుడు ప్రజలకోసం ప్రభుత్వం ద్వారా నెలకొల్పిన చౌక దుకాణాలలో, నిత్యావసర వస్తువులు సక్రమ పద్ధతిని లభించనందున ప్రభుత్వ ప్రోద్బలంవల్లనే వినిమయదార్ల సహకార సంఘాలు నెలకొల్పబడినాయి. ఆ సమయముననే మన రాష్ట్రంలో కూడా ప్రజలు తమ తమ వాడలలో, జిల్లాలలో, తాలుకాలలో, తమ అవసరాలను పూర్తి చేసికొనుటకు వినిమయదార్ల సహకార సంఘాలు నెలకొల్పుకొనుటేగాక, ప్రభుత్వోద్యోగుల, కార్మికుల, తదితర వృత్తులవారి వినిమయదార్ల సహకార సంఘాలు నెలకొల్పబడినాయి. ప్రభుత్వ గోదాములనుండి కంట్రోలు ధరలకు ఆహార ధాన్యాలను, తదితర వస్తువులను కొనితెచ్చి, తమ సభ్యులలో సక్రమంగా పంపకం చేసుకునే వ్యవస్థ జరిగింది. కంట్రోల్ ఎత్తివేసిన తర్వాత వ్యాపారస్థులు ఈ సంస్థలను పడగొట్టడానికి ఆహార నిత్యావసర వస్తువులను, ఈ సంస్థలలో ఇచ్చే ధరకంటే తక్కువ ధరకు యిస్తూ వినిమయదార్లను తమవైపుకు మరల్చుకొని, ఈ సంస్థలను పతనావస్థకు తెచ్చారు. ఈ సమయంలోనే వినిమయదార్ల సహకార సంఘాలు నామరూపాలు లేకుండా మాయమైపోయినాయి. అయితే యింకా కొన్ని వినిమయదార్ల సహకార సంఘాలు ఎంతో విజయవంతంగా తమ కార్యకలాపాలను నిర్వహిస్తూ, తమ సభ్యులకు ఈ నాటికి ఎనలేని సేవ చేస్తున్నాయి.

వినిమయదార్ల సహకార సంఘాలలో సభ్యులందరకు అవసరమైన వస్తువులు సక్రమమైన ధరలకు లభించుటే గాక కల్తీలేని వస్తువులు మంచిరకమైనవి లభిస్తాయి. ఈ సంఘాల కార్యకలాపాలను నిర్వహించే కార్య నిర్వాహకులు ఆ యా సంఘాల సభ్యుల ప్రతినిధులైయుంటారు. కాబట్టి సభ్యులకు అవసరమగు వస్తువులు, ప్రభుత్వ కంట్రోలు వస్తువులు కూడా కొంటారు. అయితే ఈ సంఘాలను నిర్వహించేవారికి మంచి వ్యాపారానుభవము, ఆహార ధాన్యాలుగాని, తదితర నిత్యావసర వస్తువులు గాని, వేటినైన కొనేటప్పుడు ఆ వస్తువులు బాగున్నాయా లేదా వాటిలో పోషక పదార్థాలు ఎంత శాతం వరకున్నాయి, ఆ వస్తువులను నిలువచేసిన ఎన్నాళ్ళవరకు చెడిపోకుండా వుండగలవు అని పరిశీలించవలసివుంటుంది. ఆ వస్తువులు కొనేప్పుడు ఉత్పత్తిదారులతో లాలూచీపడి, లంచాలుకాని, కమీషన్ కాని పుచ్చుకొన్నయెడల ఆ వస్తువులు సక్రమంగా కల్తీలేనివిగా వుండజాలవు.

సభ్యులకుకూడా వీటివల్ల నానారోగాలు సంప్రాప్తించుటకు అవకాశ ముంది. ఏ విస్సాసపాత్ర స్టోర్సునుగాని వస్తువుల సేకరణలోనే కార్యనిర్వాహకుల నీతినిజాయితీ వెల్లడవుతుంది. ఇలాంటి సహకార సంఘాలలో పనిచేసే అధికారులు నిస్వార్థులై ఉమ్మడి సభ్యుల సేవకోసం ఎన్నుకోబడినామని భావించి, తాముచేసే కృషికి ప్రతిఫలము సరిగా పొందిన వారికి సక్రమంగా సేవ చేసినప్పుడే ఈ సంస్థలు అభివృద్ధిని సాధించగలవు. కల్తీలేని మంచి వస్తువులను ఉమ్మడి సభ్యులకు అందజేయగలరు.

రోజురోజుకు విపరీతంగా ధరలు పెరిగిపోతున్నప్పుడు, ధరలను అదుపులో పెట్టి, వినియోగదారులకు అవసరమైన వస్తువులను చౌకధరకు సరఫరా చేయుటకు నేడు వినియోగదారుల సహకార సంఘాలు ఎంతో అవసరం. వాటి ప్రయోజనాలను అనుభవరీత్యా గమనిస్తే, వాటిని మనపాలిటి కల్పతరువులుగా పూజింపకపోగా, ప్రభుత్వం ఏర్పాటుచేసిన చౌక దుకాణాలలో కూడా అజమాయిషీ సరిగా లేనికారణంగా, చౌకరకమైన బియ్యము, చక్కెర, కిరోసిన్, పప్పుధాన్యాలు మొదలగునవి బ్లాక్‌మార్కెట్ చేయబడుతున్నాయి. చిల్లర దుకాణదారులవలె వీరు కూడా బియ్యంలో సన్నపు ఇసుక కలిపి అమ్మడం, తదితర వస్తువులను కూడా కల్తీ చేయడం జరుగుతోంది. సంచులకు సంచులు పంచదార బ్లాక్‌లో అమ్ముకొని, రేషన్ కార్డులు పొందినవారికి కూడా సక్రమంగా సరఫరా చేయటంలేదు. ఇలాంటప్పుడు జంటనగరాల ఆయావాడలలో పెద్ద పెద్ద పట్టణాలలో లేక పెద్ద పెద్ద గ్రామాలలో వినియోగదారుల సహకార సంఘాలు నెలకొల్పుకొని ప్రభుత్వ గోదాములద్వారా నెల సరి కోటాలను పొంది, తమ సభ్యులకు కంట్రోలు ధరలలో కనీసపు ఖర్చులు కలుపుకొని పంచుకోవచ్చు. వాటివల్ల ఆ సంఘ సభ్యులకు ఆహార ధాన్యాలు, ఇతర నిత్యజీవితావసర వస్తువులు కంట్రోలు ధరకు లభించుటేగాక, ఆ సంఘ సభ్యులలో సంఘీభావం పెరుగుటకు, వ్యాపారరీత్యా దోపిడిచేసేవారి బారినుండి సామాన్య ప్రజలను తప్పించుటకు ఇట్లాంటి వినియోగదారుల సహకార సంఘాలు అధికాధిక సంఖ్యలో నెలకొల్పబడే ఆవశ్యకత గలదు.

ఇటీవలే ప్రభుత్వం సహకార సంఘాలను నెలకొల్పుటనే వారికి వనస్పతి కూడా కంట్రోలు ధరకు సరఫరా చేయుటకు ప్రకటించింది. రోజురోజు మనరాష్ట్రంలో ఈ సంఘాల ప్రాముఖ్యత పెరిగిపోతున్నది. ఈ సంఘాల కార్యనిర్వాహకుల నీతి, నిజాయితీ, దక్షత పైననే ఇవి ఆధారపడియున్నాయి. వీటి అధికారులు అవినీతికి పాల్పడినచో సభ్యులు నానా యిబ్బందులపాలు కావలసివస్తుంది.

ఆహార ధాన్యాలు, ఇతర నిత్యజీవితావసర వస్తువులు సులభంగా లభించని ఈ రోజుల్లో వినియోగదారుల సహకార సంఘాలు ఎంతో అవసరం. వీటి విస్తృత రూపమే సూపర్ బజార్లు. ప్రభుత్వ ప్రోత్సాహంవల్ల జంటనగరాలలో, ఇతర పెద్ద పట్టణాలలో నెలకొల్పబడినా, ప్రజలకు కూడా వాటిలో శ్రద్ధ కల్పించే నిమిత్తం, సూపర్ బజార్లలో కూడా వినియోగదారులను చేర్చుకొని వారికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కలుగజేస్తున్నారు. ఈనాడు కాకపోయినా, సూపర్ బజార్లు లాభదాయకంగా నిర్వహించబడినప్పుడు, వినియోగదారులనుండే కార్యనిర్వాహకులను ఎన్నుకొని, ఆ సంస్థల నిర్వహణ బాధ్యతంతా వారికి అప్పజెప్పగలరనుటలో సందేహం లేదు. ప్రజలు ప్రతి గ్రామంలో ఇలాంటి సంఘాలను నెలకొల్పుకొని, ఆహార పదార్థాలను తెచ్చి సభ్యులకు పంచి, వారినుండి మంచిని తాము పంచుకోవచ్చు.



---

## చలనచిత్ర పరిశ్రమ . . .

(7వ పేజీ నుండి)

యీ పరిశ్రమాభివృద్ధికి తీసుకొన్న చర్యలలో ఒకటి రాష్ట్ర చలన చిత్ర అభివృద్ధి మండలిని, బాలల చలన చిత్ర సంఘాన్ని ఏర్పాటు చేయడం జరిగింది.

తెలుగు చలన చిత్రాల నిర్మాణానికి హైదరాబాదు కేంద్రం కావాలంటే యింకా చేయవలసినది ఎంతో వుంది. ప్రభుత్వానికి వున్న ఆర్థిక వనరులు పరిమితమైనవి. ప్రభుత్వం కేవలం ప్రాతిపదిక సౌకర్యాలను మాత్రమే కల్పించగలదు. ఈ విషయంలో ప్రభుత్వం ఒక ప్రోత్సాహకారిగా వ్యవహరిస్తుందనే చెప్పాలి. చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే విరివిగా స్టూడియోలు నిర్మింపబడాలి. అటువంటి స్టూడియోలను నిర్మించడానికి చలన చిత్ర పరిశ్రమలోని ప్రముఖులూ, సంపన్నులూ ముందుకొచ్చి పెట్టుబడులు పెట్టాలి. సినిమా నిర్మాతలను ఆకర్షించాలన్నా, యీ పరిశ్రమ అభివృద్ధిచెందాలన్నా తగినంతగా యిక్కడ ఫ్లోర్ సౌకర్యాలు లేకపోవడం ఒక పెద్ద ఆటంకంగా వుంటోంది. రాష్ట్రంలో చలన చిత్రాలు నిర్మిస్తే అనేకమందికి ఉపాధి సౌకర్యం లభించడమే కాక అమ్మకపు పన్ను రూపంలో, ఆదాయపు పన్ను రూపంలో యింకా యింకా యితర చిత్రా నిర్మాతలు చేసే ఖర్చులవల్ల, హోటళ్ళలో వసతికి దిగడంవల్ల రాష్ట్రానికి చాలా రకాలుగా ఆదాయం లభిస్తుంది.

# స్నేహశీలి

[ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూజీ గురించి సంగీతరూపకం ]

శ్రీ వింజమూరి శివరామారావు

కవి: ఆకసవీధిలో మెరసెనంట మహోజ్జ్వలమైన తార; ఈ
లోకమునందు చల్లనివెలుంగు చెలంగినదంట; దిక్కులన్
చీకటి మాయమాయెనట। చెన్నుగ భారతమాత పుణ్య మ
స్తోక సమున్నతత్వమున శోభిల జవ్హరులాల్ జనించుటన్।

ఆనందభవన్: అందాలకు పేరందిన మందిరమ్మునూ।
మానిత నెహ్రూ నివాస మానందభవనమ్మునూ॥
ఆ జవహర్ పుట్టినిల్లు నౌటకు గర్వింతునూ।
నాకల లానాటి వేవో మీకిట విన్పింతునూ॥
అతని కంఠమ్మునుండి ఆ తొలినిస్వనమూ–
ఆశయాల మ్రోగు నాలుగాశల నీదినమూ।
అతని కెమ్మోవినిండు ఆ తొలి మందస్మితమూ–
అందరకూ శాంతినిచ్చు సందేశము సంతతమూ॥
అతని పాదాంబుజాల ఆ తొలి విన్యాసమూ—
భారతమ్మ స్వేచ్ఛనందు దారి వినిర్మించెనూ।
అతని నేత్రాంచలాల ఆ తొలి విస్ఫారమూ–
పంచశీల సిద్ధాంతము లెంచి నిర్వచించెనూ॥

కవి: మోతీలాలసమానధీనిధి–గుణాంభోరాశి–శ్రీమంతుడై
ఖ్యాతిన్ గాంచిన న్యాయవాది–సుకృతుండై కాంచెసంతానమున్:
ఆ తండ్రిన్ మురిపించు పుత్రుడయి జవ్హర్‌లాలు జన్మించె సం
ప్రీతిన్ మానవులెల్ల మేలుగన; కీర్తించెన్ త్రివేణీ ధ్వనుల్।

ప్రయాగ: నేనె ప్రయాగను – పుణ్యచరిత్రను–
నేను త్రివేణుల సంగమధాత్రిని।
నావలెనే మన జవ్హరుడూ
పావనుడూ – గుణసాగరుడూ॥
గంగయు యమునా ఘనవాహినియూ
సంగమమైనవి నా హృదయములో।
ప్రాతవి క్రొత్తవి మేలుగనొకటై
ప్రీతిగ జవ్హరు నాశ్రయించెనూ॥
పూర్వ పశ్చిమాశామహదాశయ
సర్వము నాతడు సంగ్రహించెనూ।
వాస్తవికతయూ స్వప్నజగతియూ
వాని బ్రతుకులో మేళవించెనూ॥
నేను హరించెద పాతకములనూ–
పూని యతడు వారించు పగలనూ।
అతడు నాగతి జన సన్మాన్యుడు–
భూతలమందున కారణజన్ముడు॥

కవి: శాస్త్రవిద్యలెన్నో కళాశాల నేర్చె,
న్యాయవాదియైనాడు; వేదాంతమే స్వ
భావ సిద్ధంబుగావచ్చె; పండితుండు;
భారతీ పాదపద్మ సేవారతుండు।

సరస్వతి: భారతిని విద్యాప్రదాత్రిని – భూరి సర్వకళాధినేత్రిని।
జవ్హరుని దీవింతు – ఉత్తమసాహితీపరు జేతునూ॥
ఆదిలక్ష్మి కటాక్షమున భాగ్యాధికతత జన్మించెనూ॥
నాదుకృపయే విశ్వనుత విద్యాధికుని గావించునూ॥
జవ్హరునకావేశమున్నది – జ్ఞానయుత సంస్కారమున్నది
భావములు సున్నితములైనవి – భాషయుత్తమమైనదీ॥
ధారుణీతలి పండితులలో పేరుగను సామంతుడై॥
భారతము దర్శించు నీతడు సారతరధీమంతుడై॥

కవి: నిజదేశమ్ము స్వతంత్రతా రహితమై నిర్భాగ్యమై చింతిలన్
ప్రజలున్ దాస్యతమస్సులో పరితపింపన్ జూచి, సర్వస్వమున్
త్యజియించెన్ నెహురూ స్వదేశజన సేవాసక్తుడై; భక్తుడై
భజియించెన్ గురుగాంధిజీని శరణోపాయమ్ము సాధించగన్।

చెరసాల: నేనే చెరసాలనూ – నేనే మరజాలనూ
చూచితి నా జవ్హరు నిచ్చోట పెక్కుసారులూ॥
భీతిల్లడు కష్టాలకు – నీతి వీడనొల్లడూ।
అతని కాతిధ్యమిచ్చి ఖ్యాతినెంతో గాంచితినీ॥
దేశ దాస్యశృంఖలాల ద్రెంచ నిశ్చయించినాడు।
సర్వజనాభ్యున్నతికై సౌఖ్యము త్యజించినాడు॥
ఆత్మీయుల నస్యుల నేకాకృతి సేవించునెందు।
అందరి నెయ్యమ్ముగోరు – పొందు నెల్లవారి పొందు॥

కవి: చుక్కలజూచు; మేఘములజూచు; ముదంబున జూచు
సంజలన్;
చొక్కుచు నిండుచందురుని జూచు; అమాసల గానరాని యా
చక్కని చందమామగన సంబరమందుచునుండు నెమ్మదిన్;
మక్కువమీరగా ప్రకృతిమాత కతండొనరించు సేవలన్।

ప్రకృతి: నేనే ప్రకృతి సౌందర్యమునూ।
నేనె జగతి సౌభాగ్యమునూ।
నన్ను గనగ – కాంచగ నా చందము–
మిన్నుముట్టు జవ్హరునానందము॥
ఏరు లెడారులు కాననములు కో
నేరులు శాద్వలములు శైలములూ–
జనకోటికి నెట్లుపయుక్తంబగు
ననియోచించు సతమ్మతడూ।
వన్యమృగమ్ముల రక్షణమది సౌ
జన్యమనుచు బోధించు కృపామతి।
గగనమ్మున నందముగా నెగిరే
ఖగజాలము పోషించు దయావ్రతి॥
పువ్వులపై పసిపిల్లల చిన్నరి
నవ్వులపై నధికమ్మను రాగము।

వింటిగ పూచిన నెఱ్ఱగులాబులు
అందివాని మెప్పించుటకై !!
భావి భారతోద్దీప విభాతలు
బాల బాలికా సంతతులూ !
జవహర్ ప్రాణములోపలి ప్రాణము
లపురా పిల్లలిదెంత యదృష్టము !!

కవి : తనవారిన్ పెరవారి నొక్కగతి సఖ్యంబానురాగమ్ముతో
గను సాధుత్వము వానిసొమ్ము ; మదిలో గర్హించు
నన్యాయమున్
దనకున్ నచ్చనిచో ప్రవర్తనల సిద్ధాంతాల ఖండించు;వ్య
క్తిని మాత్రమ్ము సమాదరించు నెపుడున్, ద్వేషించ
దా నెహ్రూజీ !

సముద్రము : నేనె సాగర నాయకుడనూ ! మానిరాశయ
గాయకుడనూ !!
జవహరుడు లోకైకమిత్రుడు ! స్నేహశీలి
మహోచ్చరిత్రుడు !!
వేపంము ధీరాతిధీరుడు—నావలెనె గంభీరుడూ !
నాతరంగమురీతి పొంగెడు నాదినిది యుద్రేకమూ !!
ఆక్రమింతు తటమ్ములేను—దురాక్రమణ నంగీకరించడు!
నాదుపొంగు విపర్కరమ్ము—ప్రమాదముల నెహ్రూ
సహించడు !!
ఏటలన్నియు పర్విలెత్తుచు చేరుకొను నాలో !
కొత్తవైన బలంపులవి పొంగెత్తు నాలనిలో !!
జాతులన్నియు మైత్రిగనుచూ, ఘోరలమ్ము
సమైక్యమగుచూ,
మానవాళి పురోగమించుట వాని మధురస్వప్నమూ !
అన్యదేశములందు జనసామాన్యజీవిత మారవారసి,
సర్వలోక పురోభివృద్ధికి సాధనము యూహించెనూ !!

కవి : "అరియన్ రోషముతోడ ఛేటపుర నెయ్యంబాడ
కాల్ దువ్వుచుం
దుట ; ఛీటల్ సహనంబు జూపెడుట పొందున్ గౌర"
ఈ మాట జ
హ్వారుడే చెప్పె—"బలంబునందియు రణవ్యాపారమున్
మాన్పుడీ
నరలోకంబు సమస్త మభ్యుదయ మందన్ శక్తి
చూపించుడీ !"

హిమాద్రి: నేనె హిమాలయ శైలమునూ !
నేనె మహిత సంస్కృతి మూలమునూ !
ఉత్తర దిక్కున భరతావనికే
నుత్తమరక్షణ సమకూర్చెదనూ !!
నావలెనే మహోన్నతు డీ నెహ్రూ—
ధీవిలసద్గుణవంతు డుదారుడు !
నావలె నిశ్చలచిత్తుడు జవహర్—
పావనతర చారిత్రుడు ధీరుడు !!
సహకారముతో సమభావముతో
సహజీవన మర్పించె జనాళికి !!
పరువూ బరువూ తొలంగించుటకై
భరతాంబకు నిర్మించె ప్రణాళిక !!
తనశక్తులు యుక్తులు భాగ్యములూ
జనతాభ్యున్నతికొరకు కంకితమూ !
తన జీవితమస్తులు భస్మములూ
మనభారత భూమికె యర్పితమూ !!
స్వార్థముచూడని త్యాగశాలియై
మానవ మత నాయకుడీ జవహర్ !
స్పర్థలు వీడిన స్నేహశీలియై
మానవచాంచిత చిత్తుడు నెహ్రూ !!

# సహకార చక్కెర ఫ్యాక్టరీలు

అయిదవ ప్రణాళికా కాలంలో మన రాష్ట్రంలో 14 సహకార చక్కెర ఫ్యాక్టరీలు నిర్మిస్తారు. దీనికోసం అయిదవ ప్రణాళికలో రూ. 5 కోట్ల 30 లక్షలు కేటాయించారు. ఈ ఫ్యాక్టరీలలో రోజుకు 1,250 టన్నుల చెరకును ఆడించడానికి అవకాశం వుంటుంది. వీటిని విశాఖపట్నం జిల్లాలో దిమిలి, కొత్తకోటలలోను, తూర్పుగోదావరి జిల్లా బూరుగుపూడి, ఈదరపల్లి లలోను, గుంటూరు జిల్లాలో తెనాలి, రేపల్లె ప్రాంతంలోను, నెల్లూరుజిల్లా కొవ్వూరులోను, చిత్తూరు జిల్లాలో కుందనూరు, కర్నూలు జిల్లాలో నంద్యాల, అనంతపురం జిల్లాలో హిందుపూర్, కృష్ణాజిల్లాలో ఇబ్రహీంపట్నంలలోను, మెదక్‌లోను, అదిలాబాద్ జిల్లా ఖనాపూర్, ఖమ్మం జిల్లా పాలేర్, నల్గొండ జిల్లా హుజూర్ నగర్‌లలోను నిర్మిస్తారు.

# అయిదవ ప్రణాళికలో

## వ్యవసాయము ఆహారము జీవనోపాధి

—డా. బి. ఆర్. కె. రావు

( గత సంచిక తరువాయి )

అయిదవ ప్రణాళికలో సృష్టింపబడనున్న వేతనోద్యోగాలు ఈ కాలంలో పెరిగే శ్రామికుల సంఖ్య కంటె తక్కువ కాగలవు. ఈ ప్రణాళిక ప్రారంభం కావడానికి ముందుగానే చాలా మంది నిరుద్యోగులు, అల్ప ఉద్యోగులు, సార హీనోద్యోగులు వున్నారు. వీరందరికీ పని కల్పించడానికే వేతనోద్యోగ స్థితితో పాటు పెద్ద తరహాలో స్వయం నియమితోద్యోగస్థితిని ఏర్పాటు చేయవలసివుంది. అయితే వస్తూత్పాదన పెరుగుదల నుండి గిట్టుబాటయ్యే స్వయం నియమితోద్యోగితను వేరు చేయడానికి వీలు కాదనే విషయం నిస్సంకోచమైనది.

భూమి: వ్యవసాయము

అయిదవ ప్రణాళికలో చెప్పబడిన ఆర్థికవృద్ధి పద్ధతి వ్యవసాయ రంగానికంతటికీ కలిపి మొత్తం మీద పెద్ద ఆర్థికవృద్ధి రేటునుఆశిస్తోంది. తద్వారా చెప్పదగినంత అదనపు స్వయం నియమితోద్యోగిత లభ్యమవుతుందని ఆశ వెలువరించ బడుతోంది. వ్యవసాయంలోను,తత్సంబంధమైన కార్య కలాపాలలోను లభించే వృద్ధి రేట్ల మీదనే ఆశయం విజయ వంతం కావడం ఆధార పడి వుంటుంది. ఉద్యోగ వసతుల సృష్టిలో వ్యవసాయం ఏక కాలంలో ద్విపాత్రా నిర్వహణ సాగించడము యిందుకు ముఖ్య కారణం.వ్యవసాయ నిర్వహణకు పెద్ద ఎత్తున శ్రామికులు కావలసి వుండ; ఆహార పదార్థంగా వుండే వేతన వస్తువును సృష్టించడం ద్వారా యితర ఆర్థిక కార్య కలాపాలు హెచ్చుస్థాయిలో ఉద్యోగాలను ఏర్పరిచి కొనసాగించడానికి తోడ్పడుతుంది.

మూడింట రెండువంతుల జనాభా, యీనాడు భారత దేశంలో, వ్యవసాయం మీద ఆధారపడి వున్నారు అదనంగా వచ్చే శ్రామికుల్లో మూడింట రెండు వంతులు యీ రంగంలోనే తయారవుతారు. వ్యవసాయ రంగంలో నిరుద్యోగిత, అల్ప ఉద్యోగిత సార హీన ఉద్యోగిత హెచ్చుగా వున్నవి. ముఖ్యంగా యీ స్థితి వ్యవసాయశ్రామికులలోను, ఉపాంత కర్షకు (marginal farmers )లలోను, చిన్నరైతులలోను, భూమి మూలధనము తక్కువగా వుండటం వల్ల సార విహీనమైన భూమి వుండటం వల్ల హెచ్చుగా వుంది. ఇప్పుడు జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధి వేగం తగినంతగా లేనందువల్ల ఈ నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి వ్యవసాయ శ్రామికుల్ని యితర రంగాలకు స్థానాంతరీకరణ చేయడం తగిన సమాధానము కాజాలదు వ్యవసాయ రంగం వీరికి సంపూర్ణ ఉద్యోగిత చూపవలసి వుంది. ఈ ఆలోచనతో చూసినప్పుడే పునఃపంపిణీ చేయడానికి పూనుకునే భూసంస్కరణలు సమంజసంగా అర్థం కాగలవు.

వ్యవసాయానికి, తత్సంబంధమైన పరిశ్రమలకు భూమి ప్రాతిపదిక, ఆధారము అయితే భూమిని ఉత్పత్తి చేయడానికి వీలుకాదు. చాలా హెచ్చు భూమి వున్నవారినుండి, యితర వృత్తులలో నిమగ్నమై భూమిపై శ్రద్ధ చూపడానికి అవసరం లేకుండా వున్నవారినుండి భూమిని తీసుకొని భూమి లేనివారికివ్వడం నిరుద్యోగితను తొలగించడానికి మార్గం కాగలదు. ఈ ఆలోచనతోనే భూసంస్కరణలకు అత్యధిక ప్రాధాన్యత యివ్వబడింది. 1973 నాటికి భూసంస్కరణల పని పూర్తి కావలసి వుంది. మిగులు భూమి పునః పంపకంలో వ్యవసాయ శ్రామికులకు ప్రథమ ప్రాధాన్యత క్రింద భూమి ఇవ్వబడుతుంది. అలా భూమి యివ్వబడిన వారికి సంఘటన, పరపతి ఋణము, భూమిలో పెట్టుబడి పెట్టవలసిన ఉత్పాదకము (Input) లకు, విస్తరణ, సౌకర్యాలు (Extension Facilities) సమకూర్చబడడం ద్వారా వారి వ్యవసాయము (Husbandry) జయప్రదమయ్యేట్లు చెయ్యబడుతుంది. చిన్న కమతాలున్నందువల్ల భూమి యూనిట్ ఉన్నత ఉత్పాదకత (High Productivity)ను సాధించడానికి సాంకేతిక పరిజ్ఞాన సంబంధమైన ఆటంకాలు (Technological barriers) లేవని స్పష్టమయ్యింది. జపాన్ చిన్న కమతాలతో

వరి ధాన్యము, ఇంకిష్టు చిన్న కమతాలలో దూడి ఉన్నత ఉత్పాదకతను సాధించడము యిందుకు ప్రబల నిదర్శనము. భారత దేశంలోని అనుభవం కూడా యిందు కనుకూలంగానే వుంది. వ్యవసాయక జనాభా కార్యక్రమాలను బలపర్చేందుకు ఐయిదవ ప్రణాళికలో తగిన చర్యలు సూచించబడినవి. ఇందువల్ల రాదోయే ఉపాంత వ్యవసాయకులు (Marginal Farmers), చిన్న రైతులు లాభం పొందటం అత్యవసరం.

ఈ మధ్యన వచ్చిన సాంకేతిక పరిజ్ఞానపు మార్పు వ్యవసాయాన్ని సాంద్రంగా (Intense) నిర్వహించే అవకాశాలను పెంపొందించింది. చిన్న కమతాలమీద కూడా పెద్దగా రాబడి నిచ్చి వ్యవసాయదార్ని పేదరిక స్థాయినుంచి బయటపడే శక్తిని ప్రసాదించింది. ఈ సాంకేతిక పరిజ్ఞానాన్ని తగు రీతిలో ఉపయోగించి, వ్యవసాయ సంబంధమైన ఉపవృత్తులు చేపట్టినట్లయితే కనిష్ఠ వినియోగ స్థాయికి అవసరమైన ఆదాయాన్ని ఆర్జించే అవకాశం చేకూర్చుతుంది. ఇందువల్ల మొట్టమొదటిసారిగా గ్రామీణ పేదరికాన్ని తొలగించే అవకాశం కనుచూపు మేరలో రావడమేగాక ఆచరణ యోగ్యమైన ప్రతిపాదన వచ్చింది. ఈ అవకాశాన్ని దృష్టిలో పెట్టుకుని, ఐయిదవ ప్రణాళిక పెద్ద, మధ్యతరగతి, చిన్న తరహా నీటిపారుదల సౌకర్యాలను, రసాయనిక ఎరువులను, క్రిమి సంహారకాలను, పరిశోధనా ఫలితాలను, వ్యవసాయ విస్తరణ సౌకర్యాలను, పంట సరిపడ చేయవలసిన కార్యక్రమాల కవసరమైన వస్తువులను, పరపతి ఋణాలను సరఫరాచేసే కార్యక్రమాలను, తద్వారా నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అనువర్తింపజేసే అవకాశాల ప్రతిపాదనలను ఏర్పాటు చేసింది. ఐయిదవ ప్రణాళికా కాలంలో పశు సంవర్ధక కార్యకలాపాల పైన, పాడి పరిశ్రమపైన, మత్స్య పరిశ్రమపైన హెచ్చుగా శ్రద్ధ చూపబడుతుంది. వీటికి హెచ్చు భూప్రాతిపదిక (Land Base) అవసరం లేదు. వ్యవసాయ రంగంలో ఉద్యోగితను సాంద్రం చేసేందుకు విచక్షణా రహితంగా యంత్రాలను ఉపయోగించడానికి స్వస్తి చెప్పబడుతుంది. శ్రామికుల సంఖ్యలను తగ్గించకుండా, భూమి యూనిట్ రాబడిని మొత్తంమీద హెచ్చించే యంత్రోపయోగిత మాత్రమే అంగీకరించబడుతుంది. పంటలపై రోగనిరోధక ఔషధాలను చల్లు పద్ధతులకు, సాగుబడి, పంట రాబడిపద్ధతులకు, వాటి ఎన్నికలకు అనుగుణంగానే ఉద్యోగితా సృష్టి ఆలోచన అనుకూలంగా వుంచబడుతుంది.

వర్షాధార వ్యవసాయం భయంకరమైన సమస్యగా తయారయింది. ఈ చోట్ల వ్యవసాయం హీనమైన రాబడిని యివ్వడమేగాక, ప్రమాదకరమైన స్థితిలోవుంది. పేదరికం తీవ్రంగా వుండటమేగాక, అట్టి ప్రాంతాలంతటా విశాలంగా వ్యాపించివుంది. ఈ ప్రాంతాలు అతి పేదవేగాక చాలా వెనుకబడి వున్నట్టివి కూడా. గతంలో గరిష్ఠ రాబడిని హెచ్చు అధిక వృద్ధి రేటును యివ్వగల్గే ప్రాంతాల వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంపైననే ప్రయత్నాలన్నీ కేంద్రీకరించబడినవి. అయిదవ ప్రణాళికా కాలంలో నీటిపారుదల సౌకర్యాలపై ఆధారపడే అనేక పంటల పద్ధతి, హెచ్చు రాబడి నిచ్చే పంటల పద్ధతి వంటి సాంద్ర కార్యక్రమాలు శ్రద్ధతో నిర్వహించబడుతూనే వుంటవి. అయితే రాబడి తక్కువగానిచ్చే వర్షాధార ప్రాంతాల వ్యవసాయంమీద, యితర తక్కువ రాబడినిచ్చే ప్రాంతాల వ్యవసాయంమీద యిదే సమయంలో శ్రద్ధచూపడం అత్యవసరము నాల్గవ ప్రణాళిక (1) మెట్ట సేద్యాన్ని మెరుగుపర్చే పరిశోధన సాంద్రీకరణ (2) నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అనువర్తింపజేసి ఫలితాలనువీక్షించి దాని సామర్థ్యాన్ని పరీక్షించే పథకాలు యీ సాంకేతిక పరిజ్ఞానాన్ని అనువర్తింపజేసే ప్రదర్శన శిక్షణ కార్యక్రమాలు అమలు జరుపబడినవి. అయితే ఆలస్యంగా ప్రారంభంకావడంవల్ల, తగిన ఉద్యోగులు దొరకనందున, యీ ప్రదర్శన పథకాలనిర్వహణకు, పరిశోధన కేంద్రాలకు మధ్య తగిన సంబంధం లేకపోవడంవల్ల పై పథకాల పురోగమనం మందకొడిగా సాగింది. ఐదవ ప్రణాళికాకాలంలో మెట్టసేద్యం (Dry Farming) చేయడానికి తగినట్టి సాంకేతిక పరిజ్ఞానాన్ని రూపొందించడానికి, ప్రజలలో ప్రచారంచేసి వ్యాపింపజేయడానికి నిర్ణయింపబడింది. ఇట్టివర్షాధార ప్రాంతాలలో, చాలవరకు సంవర్ధక కార్యకలాపాలకు తగివుండటంచేత యీ కార్యక్రమంపై యిచ్చట అదనంగా మరికొంత శ్రద్ధ చూపబడుతుంది. ఇందువల్ల గ్రామీణ ప్రజల ఆదాయాలు పెరుగగలవు సాధారణ వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలు తగినంత ప్రభావశీలంగా వుండని మెట్టప్రాంతాలలో, అటువంటి యితర ప్రాంతాలలోను ప్రయోగ కార్యక్రమాలు (Public-works) ఉద్యోగితను సృష్టించడానికి అమలు జరుపబడగలవు.

పై చెప్పిన విషయాలను దృష్టిలో వుంచుకొని నాల్గవ ప్రణాళికా కాలంలో SFDA, MFAL, ఆకస్మిక గ్రామీణ ఉద్యోగిత కార్యక్రమాలు, వర్షంకాని ప్రాంతాల మేలుకొరకై, కార్యక్రమాలు ప్రారంభింప బడినవి. అయితే ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా, ఒకదానికొకటి చాలా దూరంగా అమలు జరుపబడినవి. అయిదవ ప్రణాళికలో యీ కార్యక్రమాలను వేగంగా అమలుజరుపటమే గాక, అమలుజరపడంలో మెరుగుదల కూడా వుండటానికి శ్రద్ధ వహించబడుతుంది. ఇక కార్యక్రమం తగినంత ప్రభావశీలిగా ఋజువు కావాలంటే సాధారణ అభివృద్ధి కార్యక్రమాలు ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాలను ఒకే చట్రంలో చేర్చి అమలుచేయడంవల్ల మంచి ఫలితాలు రాగలవని అనుభవం చెబుతోంది. ఈ మెట్టప్రాంతాలలో చిన్న రైతుల, ఉపాంత వ్యవసాయకుల, వ్యవసాయ కార్మికుల ఆర్థిక స్థితిని బాగుచేయడానికి, సమగ్ర ప్రాంతీయ అభివృద్ధి (Integrated area development) కి ప్రయత్నం జరపడం అత్యవసరం. ఈ సమగ్ర గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలు భూసారాలలోను, జలవనరులలోను వున్న అంతరాల ననుసరించి మారుతూ వుండటమేగాక, స్థానిక పరిస్థితుల కనుగుణ్యంగా రూపొందించబడతవి.

## కొన్ని గ్రామీణ సంక్షేమ సంబంధ విషయాలు

(1) ఇప్పటికే కొన్ని ప్రాంతాలలో కాయకష్టంచేసే గ్రామీణ శ్రామికులకు ఉద్యోగిత ధారావాహికంగా కొనసాగే గ్యారంటీ యివ్వబడింది. (2) ఇప్పటికే కొన్ని సమాజికాభివృద్ధి బ్లాకులలో గ్రామీణుల ఉద్యోగిత కొరకు ఆకస్మిక పథకాల నమలుజరిపే వీలును

తెలిసికొనేందుకు చర్య అధ్యయన (Action-cum-study) పథకాలను అమలుపరచడానికి నిర్ణయించబడింది. దీనివల్ల కనిష్ఠ వినియోగస్థిరి స్థాయి ఆదాయాన్ని ఏర్పరచుకోవడం సులభం కావడమే గాక, వ్యవసాయ కార్మికుల ఆర్థిక స్థితిగతులు మెరుగు కాగలవు. ఈ కార్యక్రమం ఐదవ ప్రణాళికలో హెచ్చుగా అమలు జరుగుతుంది. (3) చేతిపనులు, గ్రామీణ చిన్నతరహా పరిశ్రమల ఉద్యోగిత ఏర్పాటు శక్తిని కనుగొనేందుకు అధ్యయనాలు సాగించే కర్తవ్య నిర్వహణ సంఘాలు ఏర్పాటు చేయబడినవి. (4) గ్రామీణ చేతి పనులవారు తయారుచేసిన వస్తువులను అమ్ముడు పోయేట్లు చేసి వారి ఆదాయాలు హెచ్చేట్లు చేయటానికి విపణి వీధి సౌకర్యాల(Marketing Services) సంఘటన జరుగుతుంది (5) వ్యవసాయ రంగంలో గ్రామీణ సాంద్ర పద్ధతితో పని చేయవలసినప్పటికీ, వ్యవసాయాభివృద్ధిని నిరోధించే సారహీనతలను, రోగాలను తొలగించేందుకు రసాయనిక ఎరువులకు, క్రిమిసంహారక ఔషధాలు పెద్దఎత్తు కర్మాగారాలలో మూలధన సాంద్ర పద్ధతిలో తయారు చేయబడతవి. (6) ప్రజా సంక్షేమం దృష్ట్యా పిల్లలు, తల్లులు, గర్భిణులు, వృద్ధులు, రోగుల ఆరోగ్య పెంపుదలకు అనువైన పౌష్టికాహార సరఫరా కార్యక్రమాలకు కావలసిన ఆహార పదార్థలన్నిటినీ, పాలు, గ్రుడ్లు, కూరగాయలు, పండ్లను వ్యవసాయకులు హెచ్చుగా ఉత్పత్తిచేసి సమకూర్చవలసివుంది, (7) ధాన్యం పండించే సేద్యము, సంవర్ధక కార్యక్రమాలు తగినంత మంది వ్యవసాయ శాస్త్రవేత్తలకు, పశువైద్యశాస్త్ర పట్టభద్రులకు ఉద్యోగాల నివ్వగలవు. అయితే వారికి శిక్షణనిచ్చి తయారు చేయడానికిగాను, ఖాళీలెన్ని వున్నవో చూచి అంత మందినీ తీసుకొని నిరుద్యోగులు తయారు కాకుండా చూసుకోవలసివుంది. (8) ప్రజలకు ఉద్యోగాలు ఆదాయాలతోపాటు సామూహిక వినియోగ సౌకర్యాలైన విద్య, ఆరోగ్యము, పౌష్టికాహారము, త్రాగేనీరు, వసతి సౌకర్యమైన ఇండ్లు, వార్తా సౌకర్యాలు. విద్యుచ్ఛక్తి వ్యాప్తిగల, పారిశ్రామికఉపయోగములకు అందించబడతవి. (9) గ్రామాలకు రోగనిరోధక వైద్యము, పౌష్టికాహారము, శిశుమృత్యు నిరోధక సాధనములు అందించబడతవి. ఆహారములోని లోపాలు, విటమిను 'ఏ' లోపము, ఆహారము సరిపోకపోవుటచే వచ్చిన రక్తహీనత, పెల్లగాలను తొలగింపు చర్యలు తీసుకోబడతవి. కూరలుగా ఉపయోగపడునట్టి బలవర్ధకమైన ఆకుకూరలు హెచ్చుగాపండించుటకు, గ్రుడ్లు, పాలు, మాంసము, చేపలు దండిగా ఉత్పత్తి చేయుటకు, విస్తరణ, విత్తీయ, సలహా, సాంకేతిక విజ్ఞాన సరఫరా సౌకర్యములు పూర్తిగా అందించబడి ఆ కార్యక్రమములు ప్రోత్సహించబడును. (10) గ్రామీణ ప్రజల సౌకర్యానికి గ్రామ పారిశుధ్య కార్యక్రమాలు సమలు జరుపుటయేగాక, గ్రామీణ వ్యవసాయాభివృద్ధికి జలపాతాల నుండి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిజేసి సరఫరా చేయబడుతుంది. (11) గ్రామాలనుండి పంటలను, వస్తువులను సులభంగా పట్టణాలకు తీసుకపోయి అమ్ముకుని ఆర్జించుకునేందుకు పట్టణాలకు పోయే పెద్ద రోడ్లను, చిన్న రోడ్లను వేయడంద్వారా గ్రామాలతో కలిపి పట్టణగ్రామ వాణిజ్య సంబంధం జయప్రదంగా ఏర్పర్చబడి కొనసాగించబడుతుంది. (12) ప్రజాసంక్షేమం దృష్ట్యా యితర దేశాలపై ఆధారపడకుండా స్వయం నిర్భరతను సాధించడం అత్యవసరం. ముఖ్యంగా దైనందినావసరమైన ఆహారోత్పత్తి సరఫరాలలో యీ స్వయం నిర్భరత అతిముఖ్యమైనది. ఈ స్వయం నిర్భరత ఆశయం పేదరికాన్ని తొలగించే ఆశయానికి, పేదరికాన్ని తొలగించడం సంతృప్తిని, ఆరోగ్యాన్ని, కౌశల్యాన్ని, సామర్థ్యాన్ని సమకూర్చి ఉత్పత్తిని పెంపొందింపజేసి స్వయం నిర్భరతను సమకూర్చడానికి తోడ్పడగలవు. ఆహార పదార్థాలను యితర దేశాల నుండి దిగుమతి చేసుకుంటే విదేశమారక ద్రవ్యము హెచ్చుగా ఖర్చయి వ్యాపార సంతులనము, విదేశవ్యాపార చెల్లింపుల శేషము మనకు వ్యతిరేకము కావడమేగాక, మనకున్న విదేశీమారక ద్రవ్యంతో ఆర్థికాభివృద్ధి కవసరమైన యంత్రాలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవడానికి ఆటంకమై ఆర్థికాభివృద్ధి కుంటుపడగలవు. తత్కారణంగా ఆహార పదార్థాలను హెచ్చుగా ఉత్పత్తి చేసి స్వయం నిర్భరతకు తోడ్పడుటకు అయిదవ ప్రణాళిక వ్యవసాయానికి ప్రథమ ప్రాధాన్యత నిచ్చింది.

## వృద్ధిరేటు

అయిదవ ప్రణాళికలో వ్యవసాయము, దాని అనుబంధ కార్యకలాపాలు 4.73 వృద్ధిరేటును సాధించి 3.97 శాతం మూల్యమును అదనంగా సృజించగలవు. ఆహార ధాన్యాలు 3 99 శాతం వృద్ధి రేటును, 3.23 అదనపు మూల్యాన్ని; యితర పొలం పంటలు 4.90 శాతం వృద్ధి రేటును, 1.11 అదనపు మూల్యాన్ని ; పశు సంవర్ధన, మత్స్య పరిశ్రమలు 5.81 శాతం వృద్ధిరేటును, 5.26 అదనపు మూల్యాన్ని; కాఫీ, టీ వగైరా తోట పరిశ్రమలు 4.94 శాతం వృద్ధి రేటును, 4.15 అదనపు మూల్యాన్ని; అడవులు 6 42 శాతం వృద్ధి రేటును, 5.62 అదనపు మూల్యాన్ని; ఆహార తయారీలు (Food products) 4.93 శాతం వృద్ధిరేటును, 4.54 అదనపు మూల్యాన్ని; పంచదార బెల్లము 1.94 శాతం వృద్ధిరేటును, 4.52 అదనపు మూల్యాన్ని గింజల నుండి తీసిన నూనెలు 5.25 శాతం వృద్ధి రేటును 4 83 అదనపు మూల్యాన్ని; టీ, కాఫీలు 3 66 శాతం వృద్ధి రేటును, 3.25 అదనపు మూల్యాన్ని యితర ఆహార తయారీలు 6.03 శాతం వృద్ధిరేటును, 4.61 అదనపు మూల్యాన్ని, తోలు వస్తువులు 5 96 శాతం వృద్ధిరేటును, 5.55 అదనపు మూల్యాన్ని సముపార్జించాలని కోరబడింది.

అయిదవ ప్రణాళిక కాలంలో ప్రణాళికేతర ఆదాయ ఖర్చు కేంద్ర ప్రభుత్వం ఆహారోత్పత్తికి రూ. 750 కోట్లు సబ్సిడీగా యిస్తుంది. ఇదేకాలంలో 1971–72 పన్నురేట్ల ప్రకారము 1971–72 వెల రేట్ల ప్రకారము కేంద్ర ప్రభుత్వానికి భూమిపై విధించిన పన్ను నుండి రూ. 608 కోట్లు, వాణిజ్యేతర నీటిపారుదల పన్ను నుండి రూ. 49 కోట్లు వస్తవి. 1971–72 ధరల ప్రకారము సహకార పంచదార ఫ్యాక్టరీలకు యితర పరపతేతర సంస్థలకు కలిపి రూ. 200 కోట్లు సమకూర్చబడుతవి.

అయిదవ ప్రణాళిక కాలంలో వ్యవసాయ రంగంలో, 1971–72 ధరల ప్రకారము ప్రభుత్వ రంగంలో రూ. 1,400 కోట్లు

(తరువాయి 22 వ పేజీలో)

# ఛాయా చిత్రాలు



ముఖ్యమంత్రి శ్రీ జె వెంగళరావు డిసెంబరు 25 న బేగంపేట విమానాశ్రయంలో రాష్ట్రపతికి స్వాగతం చెప్తున్న చిత్రం.

రాష్ట్రపతిని ఆంధ్రప్రదేశ్ గవర్నరు డిసెంబ 25 న కలుసుకున్నప్పటి చిత్ర



# వార్తా చిత్రాలు



ఆంధ్రబ్యాంక్ స్వర్ణోత్సవాల సందర్భంగా డిసెంబరు 26న రాష్ట్రపతి శ్రీ వి. వి గిరి, స్వర్గీయ డా. పట్టాభి సీతారామయ్య చిత్రపటాన్ని ఆవిష్కరించారు.

ముఖ్యమంత్రి హైదరాబాదులో డిసెంబరు 16 న రోడ్డు, భవనాలకు సంబంధించిన సదస్సును ప్రారంభించారు. ఆర్థిక మంత్రి శ్రీ ఎన్. రామచంద్రా రెడ్డి (ఎడమ నుంచి రెండవ వారు) అధ్యక్షత వహించారు.



# జాతీయ సమైక్యతలో ఆధునిక తెలుగు కవుల పాత్ర

— శ్రీ గుంటి పుండరీకాక్షయ్య

ప్రాచీన కాలమునుండి భారత దేశము విభిన్న మతములకు భాషలకు, ఆచారాలకు, జాతులకు నిలయమైవుంది. అథర్వణవేదం లోని భూమి సూక్తాన్ని బట్టి చూస్తే మన పూర్వులు భారతమాతను స్తుతిస్తూ విభిన్న ప్రదేశాలలో సంచరిస్తూ, పవిత్రమైన తెల్లని పాలను అందజేస్తూ, తన బిడ్డల కన్నిటికి సమానంగా పాలిచ్చే గోవుతో భారత మాతను పోల్చారు. భారత భూమిని గురించి వర్ణిస్తూ ఇచ్చట నానా భాషలు మాట్లాడేవారు, నానా మతాల్ని అనుసరించే వారు, నానా ఆచార వ్యవహారాల్ని అనుష్ఠించే వారున్నారని మన పూర్వులు స్పష్టంగా చెప్పివున్నారు. నాటినుండి నేటివరకు భారత దేశము ఎన్నో నాగరికతలను, జాతులను, మతాలను, సంప్రదాయాలను తనలో అంతర్లీనం చేసుకుంది. విభిన్న మతాల, జాతుల, భాషల, సంస్కృతుల, సంప్రదాయాల సంగమమే భారత దేశం అని ఒక్క మాటలో మనం పేర్కొనవచ్చును. ఇంత వైవిధ్యము, భిన్నత్వము, యీ దేశంలో పొడసూపినా 'భారతాత్మ' పూసలలో దారంలా అంతర్లీనమైవుంది. ఏబదియారు కోట్ల ప్రజలుగల యీ సువిశాల భారతదేశంలో జాతి, మత, కుల, భాషా వైషమ్యాలు 'కడివెడు పాలలో మజ్జిగ చుక్క' రీతిగా అప్పుడప్పుడు పొడసూపుతూనే వున్నాయి. దేశం ప్రగతి పథంపై పురోగమించటానికి, అభ్యుదయ కార్యక్రమాలు చేపట్టటానికి దేశంలో చెలరేగే యీ వైషమ్యాలు, వైమనస్యాలు అడ్డుగోడలుగా నిలుస్తున్నాయి. దేశాభివృద్ధికి చక్కని ప్రణాళికలు ఎంత దోహదం చేస్తాయో దేశం సుభిక్షంగా రూపొందటానికి ప్రజలలో ఐకమత్యం, సమదృష్టి మరింతగా దోహదం చేస్తాయి. జాతీయ సమైక్యం పరిపుష్టం కావాలంటే దేశభక్తి జాతీయ సమైక్యత కుల మత రహిత సమాజ వ్యవస్థ వ్యత్యాసాలు లేని ఆర్థిక వ్యవస్థ నాలుగు మూల స్తంభాలై దేశ ప్రగతికి రాచబాట వేస్తాయి.

జాతీయ సమైక్యతకు దోహదంచేసే యీ నాలుగు అంశాలకు కవులు ఎలా జీవం పోసిందీ పరిశీలిద్దాం:

## దేశభక్తి

ఒక దేశం మూడు పూవులారు కాయలుగా విలసిల్లాలంటే ఆ దేశంలో ప్రజలకు దేశాభిమానం 'వెన్నతో పెట్టిన విద్య'యై తన దేశం, తన జాతి అనే అభిమానం గుండెలోతుల్లో పాతుకు పోవాలి. ఈ అభిమానం సంకుచితమై మానవ ప్రవృత్తిని మార్చివేసే స్థాయికి దిగజారి పోకూడదు. ప్రతివ్యక్తి సోమరితనాన్ని విడనాడి శక్తివంచన లేకుండా దేశాభివృద్ధికి కృషి చేసిననాడు పరిశ్రమలలో ఉత్పత్తి పెరుగుతుంది. వ్యవసాయంలో విప్లవాత్మకమైన మార్పులొచ్చి పంటలు రెండింతలవుతాయి. కార్యాలయాలలో పని తొందరగా జరిగి నిర్మాణాత్మక కార్యక్రమాలు చురుకుగా కొనసాగుతాయి. దేశాభిమానం యింతటి మహోన్నతమైన భావిని దేశానికి నిర్ణయిస్తుంది.

మన దేశం దాస్య శృంఖలాలలో మ్రగ్గుతున్నపుడు ప్రజలలో జాతీయభావం, దేశభక్తి దీపింపజేయటానికి గురజాడ 'దేశభక్తి' గీతం గుండె గుండెలో నినదించింది.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా!"

అని ఆలాపిస్తూ గురజాడ ప్రజలకు కర్తవ్యాన్ని నిర్దేశించాడు. పాడిపంటల అభివృద్ధికి పాటుపడమని ప్రజలకు హితబోధ చేశాడు. అన్ని దేశాలు తిరిగి 'దేశి' సరుకులను అమ్మమన్నాడు. ప్రజలు యీసురోమంటుంటే దేశమెట్లా బాగుపడుతుందని ప్రశ్నించాడు. నాకు దేశాభిమానముందని వొట్టి గొప్పలు చెప్పుకోవద్దన్నాడు. ప్రజలకు ఏదైనా మేలు చేయండని మహత్తర సందేశాన్నిచ్చాడు.

కవులకు సందేశమిస్తూ
"ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్!"

దేశాభిమానము ప్రజలలో కలిగించుటలో కవుల పాత్ర సున్నితంగా సెలవిచ్చాడు.

"దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుజులోయ్"

అనే సార్వకాలిక సత్యాన్ని తన కవితా విపంచిపై నూతన రాగంలో పలికించాడు.

'జన్మభూమి' గీతంలో రాయప్రోలు సుబ్బారావు దేశభక్తి హృదయము చీల్చుకుని వెలువడింది. గురజాడ గేయంలో కొరవడిన ఆత్మీయతను రాయప్రోలు తన గీతంలో పూరించి ప్రజా హృదయాలలో ఉత్తేజం కలిగించారు.

"ఏదేశ మేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా, యెవరెదురైనను
పొగడరా, నీ తల్లి భూమి భారతిని!
నిలుపరా, నీ జాతి నిండు గౌరవము.
లేదురా యిటువంటి భూదేవి యెందు,
లేరురా, మన వంటి ధీరులింకెందు!"

దేశాభిమానాన్ని రేకెత్తించే యిటువంటి గీతాలు ఆనాటి బాలబాలికల రసనాగ్రాలపై నర్తించాయి.

భారత దేశ దాస్య విచ్ఛేదనానికి తమ కలాలకు పదును పెట్టి సమరాంగణంలో కదను త్రొక్కిన నాటి చిలకమర్తి, గరిమెళ్ల సత్యనారాయణ, బసవరాజు అప్పారావు, దువ్వూరి రామిరెడ్డి, వడ్డాది సీతారామాంజనేయులు వంటి ఎందరెందరో మహానుభావులను మనం విస్మరింపలేము.

ఆంధ్రదేశం 'దేశభక్తి'లో 'దేశాభిమానము'లో తనదైన ప్రత్యేకతను ప్రదర్శిస్తూనే వుంది. చైనాదేశం భారతదేశంపై దండయాత్ర సలిపినప్పుడు తెలుగు కవులు విజయశంఖం పూరించి, సమరఢంకా మ్రోగించి, విజయగీతాల్ని పాడారు. పాకిస్తాన్ దండయాత్ర సలిపినప్పుడు, మన వీరజవాన్లను వెన్నుతట్టి, పాకిస్తాన్ దమన నీతిని, అక్రమాల్ని ఖండించి జాతి ప్రతినిధులై నిల్చారు. నిన్న బంగ్లాదేశ్‌లో పాక్ జరిపిన అత్యాచారాలకు, అక్రమాలకు వ్యథితులైన కవిశేఖరులు తీవ్ర గర్జనలు చేసి పాక్ అక్రమాల్ని నలుమూలలా చాటించారు.

స్వాతంత్ర్యోద్యమానికి పూర్వం నాటి తెలుగు కవులు ప్రజలలో 'దేశభక్తి' పాదుకొనటానికి కృషిచేస్తే, స్వాతంత్ర్యానంతరం తెలుగు కవులు భారతీయులలో 'సమైక్యత' వర్ధిల్లటానికి ఉదారభక్తిగా కృషిచేస్తూనే వున్నారు.

## జాతీయ సమైక్యత

భారతదేశంలో సర్వులు సమానమే. పేదవానిలో ప్రవహించే రక్తం, ధనికులలో ప్రవహించే రక్తం ఒక్కటే. నల్లవాని మేనిలో ప్రవహించే రక్తం పాలవన్నె మేనులో ప్రవహించే రక్తం సమానవర్ణమే. ఒకరు ఎక్కువ మరొకరు తక్కువనే భావనలు మనిషి మనిషికి అంతరాన్ని పెంచుతాయి. అందుకే

"బొగ్గువలె కనిపించు చర్మపు
బొందిలో తరగెత్తు నెత్తురు
పాల వన్నెల మేను లందున
లీలగా ప్రవహింపగాదా!"

(మరో హరివిల్లు : సి. నారాయణరెడ్డి)

అని సి. నారాయణరెడ్డి చక్కగా గానం చేశాడు.

జాతీయసమైక్యతకు ప్రజలలో ఐక్యత పూసలలో దారం వంటిది. ఐకమత్యంతో సాధించలేని దంటూలేదు. విభిన్నజాతుల, మతాల, భాషలతో నిండిన్న భారతదేశంలో జాతి, మత, ప్రాంత, భాషా సంబంధమైన వైమనస్యాలు, వేర్పాటు ధోరణులు పెచ్చరేగి దేశ సుస్థిరతకు, సమైక్యతకు భంగం కలిగే ప్రమాద పరిస్థితులు అప్పుడప్పుడు తలెత్తుతున్నాయి. ప్రజలలో సహృదయభావాలు లోపించినందువల్ల, స్వార్థపరశక్తుల ప్రోత్సాహం వల్ల యీ విపరీత పరిణామం ఏర్పడుతోంది. ఇటువంటి సందర్భాలలోనే కవుల బాధ్యత గురుతరమవుతుంది. స్వార్థశక్తుల ఆట కట్టటానికి, ప్రమాదాన్ని నివారించటానికి కవులు ఉదారభక్తిగా దోహదం చేయాలి. ఈ ఐక్యం ఎంత ముఖ్యమో మహాకవి శ్రీ శ్రీ సెలవిస్తున్నాడు చూడండి.

"ఐక్యం అదీ మనకు ముఖ్యం
అందులోనే వుంది సౌఖ్యం
లేనిపోని చీలికలు
రెండు రెండు నాలుగు
ఛీ యిదా బతుక్కి ఫాయిదా"

అని అనైక్యతను నిరసిస్తున్నాడు మహాకవి శ్రీశ్రీ

"ఐక్యం అన్నిటికి మూలం
అదే కదుల్తోంది కాలం
పురోగతి ప్రపంచ నీతి
గెలిచేదే మానవ జాతి"

జాతీయ సమైక్యతకు డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ 'సువర్ణ మంత్రపుష్పం' గేయంలో చక్కని రూపురేఖలు సమకూర్చారు. జాతీయ సమైక్యతకు దోహదం చేసే యీ గేయం అక్షరాల సువర్ణాలలో పొదిగిన కమనీయ మణిహారం.

"ఈ దేశం నాదనటం ఎప్పటిదో పాతమాట
ఈ దేశం నేననటం ఇది నవకవితా సూత్రం
నా దేహం నిండా ధమనుల్లో పారే రక్తం
గంగా సింధూ యమునలు కావేరీ కృష్ణమ్మలు
హిమ మకుటం ఉష్ణీషం, కాశ్మీరం నా కుంకుమ
వింధ్యాద్రి నా హృదయం సింధువులో నా ఉదయం
.. .. .. .. .. .. .. .. .. ..
.. .. .. .. .. .. .. .. .. ..
వేషం భాషా ప్రాంతం మతం మరం వేరైనా
ఒకే దేశ మొకే ఆత్మ ఒకే ఒక్క జెండా—"

దేశ సరిహద్దులకే పరిమితమై దేశ సమైక్యతను బోధించిన కవులు కొందరైతే, ఎల్లలను దాటి విశ్వమానవ కుటుంబాన్ని సమదృష్టితో చూచే కవులు కొందరు. ఈ ఎల్లలకు అతీతంగా ఎగిరే విశ్వమానవ పతాకాన్ని బాలగంగాధరతిలక్ ఎలా ఎగురవేస్తున్నాడో చూడండి.

"సంకుచితాలైన జాతిమతాల సరిహద్దుల్ని చెరిపేస్తున్నాను నేడు
అకుంఠితమైన మానవీయ పతాకను ఎగురవేస్తున్నాను చూడు
చరిత్రల రక్త జలధిపై స్నేహసేతువు నిర్మిస్తున్నాను రండి
వని వసివసివాడని కాంతి పొరలబడి స్వేచ్ఛగా జలకమాడండి."

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. సంపాదించిన స్వాతంత్ర్యాన్ని కబళించటానికి నగాకోరులు, దిగుల్బాజీలు నిఘాతో వలలు పన్నుతున్నారు. ప్రజలలో అశాంతి చెలరేగింది. మనిషి మనిషికి మధ్య స్పర్థలు పెరిగిపోతున్నాయి. ఈ పరిస్థితులలో స్వాతంత్ర్యాన్ని దక్కించుకోవాలంటే కేవలం స్వాతంత్ర్యం రోజున మూడు వన్నెల పతాకను లాంఛనంగా ఎగురవేసినంత మాత్రాన కర్తవ్యం పరిపూర్తికాదు. ఆరుద్ర ఏమంటున్నాడో చూడండి.

"కుడి చేయి ఎడమచేతిని కొట్టివేస్తోంది
ఎడమకన్ను కుడికంటిని తిట్టిపోస్తోంది
నడుమనున్న మెదడు నరకంలా జ్వలిస్తోంది
విడదీసే అవయవాలు వేరే ఏమున్నాయి?

మరి స్వాతంత్ర్యం దక్కించుకోవడ మెలాగ!
మనలో విభేదాలీ ఒక్కరోజు పోతే చాలా?
ఈనాడు సంబరాలు చేయడం కన్నా
రానున్న రోజులకై ఒక్కటవటం మిన్న."

"భరత ఖండంబు నేడొక పంటచేల
పండుచున్నాము తీయని పిండివంట
విందు దినుసులలోన ఓ వెర్రివాడ!
వేయవలదయ్యా చాటుగా విషపు బొట్టు!!"

అంటూ ఆరుద్ర భారతదేశం స్వాతంత్ర్య ఫలాన్ని అనుభవించబోయే తరుణంలో లేనిపోని కలహాలతో, పై మనస్పర్థలతో యీ స్వాతంత్ర్య ఫలాన్ని నోటికి రాకుండా చేసుకోవద్దని పరోక్షంగా హెచ్చరించాడు.

## కులమత రహిత సమాజ వ్యవస్థ

భారతదేశం ప్రజాస్వామిక దేశం. ఈ దేశం సర్వతో ముఖాభి వృద్ధితో ప్రగతి సాధించాలంటే కులమతాల అడ్డుగోడలు తొలగిపోవాలి. దురదృష్టవశాత్తు ప్రజాప్రతినిధులుగా నిలబడే పెద్దలు పదవీ వ్యామోహముతో కులమత వర్గ విభేదాలు ప్రజలలో రేకెత్తించి, స్వప్రయోజనాన్ని సాధించుకుంటున్నారు. ఈ విభేదాల వలననే అర్హులైన అభ్యర్థులు పరిపాలనాధికారాన్ని కోల్పోతున్నారు. ఈ అవ్యవస్థ సమాజప్రగతికే అవరోధం. ఈ కులమతాల వ్యవస్థతో సంకుచితమైన దృక్పథం తొలగిపోయి, ప్రజలలో విశాల దృక్పథం అలవడిననాడు దేశంలో సాంఘిక న్యాయం సముచిత రీతిలో అందరికి చేకూరుతుంది.

ఒకనాడు పంచములను 'హిందూ సంఘములో' చాల హీనంగా చూసేవారు. వారిని అంటరాని వారుగా వెలివేసి సంఘ బాహ్యులను చేశారు. గాంధీగారు అస్పృశ్యతా నివారణోద్యమము చేపట్టక ముందే గురజాడ 'లవణరాజు కల' అనే ఖండిక ద్వారా అంటరానితనాన్ని గట్టిగా నిరసించాడు. ఆ ఖండికలో రాజుద్వారా గుణం ప్రధానం గాని, కులం కాదని స్పష్టం చేశాడు.

"మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల నొసంగిన వర్ణ ధర్మ మ
ధర్మ ధర్మంబే
మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ, రెండె కులములు
మంచి యన్నది, మాలయైతే,
మాలనే అగుదున్."

గాంధీగారి అస్పృశ్యతా నివారణోద్యమము 1920 తర్వాత భారతదేశమంతటా వ్యాపించింది. తెలుగు కవులు పలువురు హరిజనోద్ధరణను, హరిజన దేవాలయ ప్రవేశాన్ని సమర్థిస్తూ, గీతాలు, పద్యాలు వ్రాశారు. వెంకట పార్వతీశ్వర కవులు 'పంచమాభినందనము' అనే ఖండికలో

"మమత దప్పిన యాతడు మాలగాక
మాట దప్పిన యాతడు మాలగాక
అన్నెమును పున్నె మెఱుగని యట్టిమాల
మాలయే? దేవుమెడ పూలమాల గాక"

అని మాలలంటే ఎవరో చక్కగా సెలవిచ్చారు.

జాషువా 'గబ్బిలము' ఖండ కావ్యంలో మానవుల హెచ్చు తగ్గులను నిర్ణయించే యీ సమాజ వ్యవస్థను నిరసించాడు. సమాజంలో అట్టడుగున పడి హీనంగా చూడబడే పంచముని దుస్థితికి ఆవేదనా భరితుడైన కవి 'గబ్బిలము' ద్వారా కైలాస పతికి విన్నవించుకున్నాడు. ఈ కావ్యంలో కవి ఆ నాడు సంఘంలో పేరు కొని పోయిన వర్ణ వ్యవస్థలోని క్రుళ్లును వెలి గ్రక్కటానికి ప్రయత్నించాడు. అంటరాని వానికి 'సనాతన ధర్మధేనువు పితికిన పాలు లభించవని' వాపోతాడు. ఆరని గాలిసోకగా 'నాల్గు పడగల హైందవ నాగరాజు' కసరి బుసకొడతాడని నాటి సమాజ వ్యవస్థను కండ్లకు కట్టినట్లు రూపకల్పన చేస్తాడు.

కాటూరి వేంకటేశ్వరరావు 'గుడిగంటలు' రచనలో హరిజనుల దుఃఖాన్ని సజీవంగా చిత్రించి, తిరుపతి వెంకన్నను మేల్కొల్పటానికి ప్రయత్నించాడు.

ఆంధ్ర ప్రదేశంలో కవులంతా కులమతాలకు అతీతులే, మతము మానవ నైతిక వర్తనను సరిదిద్దటానికి పాటుపడుతున్నా, ఆమతాన్ని అనుసరించే పెద్దలు కొందరు ఏవో కొన్ని విషబీజాలు నాటి వ్యర్థ కలహాలకు, అనర్థాలకు దారితీస్తున్నారు. ఈ విషబీజాలకు తావు లేకుండా చేయటం కవుల కర్తవ్యం. సంకుచిత భావాలను విడనాడి, విశాల హృదయంతో ప్రతి వ్యక్తి మెలగిననాడు భూలోకమే స్వర్గలోక మవుతుంది. ఇది కవుల ఆకాంక్ష.

"యెల్ల లోకము వొక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ.
మతములన్నియు మాసి పోవును,
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును.
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్"

అనేది గురజాడ వసుధైక గీతమైతే,

"మనుషులందరు అన్నదమ్ముల
మాదిరిగ జీవించ గల్గిన
మర్త్యలోకమె దివ్య పదవికి
మారుపేరై పరిమళించును."

అనేది సి. నారాయణరెడ్డి తీయని స్వప్నం.

స్వతంత్ర భారతము అవతరించిన శుభవేళ కవి ఎలాంటి సమాజాన్ని నిర్మించుకోమంటున్నాడో చూడండి.

"కుల వర్గములు పెంచు కుళ్ళింత లేని
మత పిశాచంబుల మనుగడ లేని
ధన పద్దరిద్ర భేదచ్ఛాయ లేని
జీవత్సమాజంబు సృష్టి గావించి
తమ్ముడా! నీ తీరు తిరలింపవోయి!
మన ప్రాక్తన మనస్సు మరలింపవోయి!"

అనే తుమ్మల సీతారామమూర్తి చౌదరి చేసిన ప్రబోధంతో మనము ఏకీభవిద్దాం.

ఆధునిక సమాజంలో దేవుని పేరిట జరిగే దారుణాల్ని, ప్రజలలో పేర్కొన్న మత మౌఢ్యాన్ని, పెత్తనం చెలాయించే మతాచార్యుల దురాగతాల్ని ఉమదైన ప్రత్యేక శైలిలో, భాషలో 'దిగంబర కవులు' చీల్చి చెండాడారు. విప్లవ కవులు కూడ మతంపై ధ్వజమెత్తారు.

కులమత రహిత సమాజ వ్యవస్థకు కవులు కన్న కలలు సఫలీకృతమై ప్రభుత్వము ఆశించే సామ్యవాద వ్యవస్థ ప్రజాభ్యుదయానికి సోపానాలు నిర్మిస్తుందని ఆశిద్దాం.

## సమసమాజ స్థాపన

ప్రజాస్వామ్యమైన భారత దేశంలో రాజ్యాంగరీత్యా ఏ వ్యక్తికైనా, ఏ ప్రాంతంలోనైనా సంపాదించుకునే హక్కుంది. అయినా అవకాశం వుంది కదా అని కోట్లకు పడగలెత్తితే ఆర్థిక అసమానతలు ప్రబలి ప్రజానీకంలో అశాంతి, అసంతృప్తికి నిలయమై విలయానికి దారితీస్తుంది. ధనికునికి, నిర్ధనునికి మధ్య, యీ ఆర్థిక వ్యత్యాసాలు భారత ప్రభుత్వ లక్ష్యమైన సోషలిజం స్థాపనకు విఘాతం ఏర్పడుతుంది. అనంతంగా ఎదిగే యీ ఆర్థిక వ్యత్యాసాలు సమాజంలో సుస్థిర శాంతికి విఘాతమై ప్రజలలో పేద-ధనిక తారతమ్యాల ఫలితంగా సమైక్యతకు గొడ్డలిపెట్టు అవుతుంది.

స్వాతంత్ర్యానంతరము కవులు తమ లేఖిని ద్వారా సమ సమాజ స్థాపనకు నాంది గీతాలు పలికారు. ఆకాశపు దారులంట హడావుడిగా వెళ్ళిపోయే జగన్నాథ రథ చక్రాలను భూమార్గం పట్టించి, నూతన సమాజాన్ని నిర్మించాలని కవులు కలలు కన్నారు. భవిష్యత్తును గురించి బంగరు కలలు కన్న శ్రీశ్రీకి స్వాతంత్ర్యానంతరము మానవుడు కించిద్విషాదం, కించిన్నిరాశ, కొంచెం విరాగం, కించిదసంతృప్తితో గోచరించాడు. అర్ధ నగ్నంగా ఆకాశాన్ని కప్పురుని, నిండని కడుపుతో, మండుతున్న కళ్ళతో, స్వతంత్ర భారత వర్ష మానవుడు ఆ నేత్రాలలో మెదిలాడు.

"అతణ్ణి జాగ్రత్తగా చూడండి
స్వతంత్ర భారత పౌరుడు
అతని బాధ్యత వహిస్తామని
అందరూ హామీ ఇవ్వండి,
అతని యోగ క్షేమాలకు
అంతా పూచి పడండి,
అతికించండి మళ్ళీ
అతని ముఖానికి నవ్వు!"

అంటూ సామాన్య మానవునిలో పేరుకున్న అసంతృప్తి, నిరాశ, నిస్పృహలకు అందరూ బాధ్యులని, అతని బ్రతుకును తీర్చిదిద్దటం ప్రతి ఒక్కని విధియని శ్రీ శ్రీ చక్కగా గుర్తు చేశాడు.

అభ్యుదయ కవితా పథికులైన కొందరు కవులు సమసమాజ నిర్మాణానికి ఎలా గానం చేశారో తిలకించండి.

"అనాదిగా సాగుతోంది అనంత సంగ్రామం,

అనాథుడికీ అగర్భ శ్రీమంతుడికీ మధ్య" అని దాశరథి ఎలుగెత్తి చాటితే -

"అలకాపురానికీ అలగా జనానికీ,

ఇది సంకుల సమరం" అంటున్నాడు రమణారెడ్డి.

"ఆకటితో అరటితో అలమటించు జీవులార!

అన్నపూర్ణ స్వర్ణపాత్ర వస్తున్నది ప్రజాశక్తి" అని ఏల్చూరి,

"గుండె గుండెకు చిచ్చు మండించి లేవండి,

గుడిసె గుడిసెకు కోట నిర్మించి లేవండి" అని అనిసెట్టి చాటితే-

"భూమ్మీద వస్తులున్న మనుషుల్ని చూసి,

ఆకాశం కంట తడిపెట్టినట్లు,

వాన ముమ్మరంగా కురుస్తుంటే" అని అలంకారికంగా అన్నారు కుందుర్తి. వీరంతా అభ్యుదయాకాశంలో దేదీప్యమానంగా వెలుగులు విరజిమ్మే నక్షత్రాలుగా మనకు గోచరిస్తారు.

వీరేకాక నారాయణరెడి, బాలగంగాధర తిలక్ వంటి కవు లెందరో తమ కవితలలో సామాన్యుని గుండె ఘోష వినిపించారు. సమాజ పరిస్థితికి వేసారి రగిలిన 'దిగంబర కవులు' తమ ఆవేశాన్ని సమాజ దూషణలో ఉపశమింప జేసుకుంటున్నారు. 'విప్లవ కవులు' సాయుధ విప్లవంతో తప్ప సమసమాజం ప్రభవించదని తమ కవితల ద్వారా బాహాటంగా చాటుతున్నారు. సమాజం యింకా వెర్రితలలు వేయకముందే ప్రభుత్వం సాంఘికాభ్యుదయానికి బాటలు వేసి ఎల్లరు సుఖపడేటట్లు క్రొత్త మలుపు తీసుకురావాలి.

ఏనాడో సర్వోదయ గానం చేసిన తుమ్మల సీతారామమూర్తి చౌదరి పేదల పరిస్థితి యిలాగే కొనసాగితే ఎటువంటి ప్రమాదం ముంచుకువస్తుందో అనాడే హెచ్చరించాడు. తన క్రాంత దర్శిత్వాన్ని ప్రదర్శించాడు.

"ఎముకల గూడులై బ్రదుకు నీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శో
కము దపించు మన్ సెగలు క్రక్కు దరిద్రుల ద్రోసిపుచ్చు కా
లము చనె, విప్లవాగ్ని దెసలన్ గబళింపక ముందె యందలా
లమరిన వారు మేల్కొని యహంకృతి నుజ్జన సేవ లగ్గగున్"

ఆనాటి విప్లవ కవుల కంటె ఎంతో ముందు చూపు యీ పద్యంలో మనం గమనించ వచ్చు.

నేడు కలం పట్టిన యువతరమంతా యీ సాంఘిక అసమానతలను, ఈ వైరాగ్యాన్ని ఎంత తొందరగా తొలగిస్తే దేశ సమైక్యత, దేశ శాంతి అంత బాగా సుస్థిరమవుతాయి.

శ్రీ శ్రీ ఆకాంక్షించినట్లు ఏనాటికైనా—

"స్వాతంత్ర్యం
సమభావం
సౌభ్రాత్రం
సౌహార్దం
పునాదులై ఇళ్ళు లేచి
జనావళికి శుభం పూచి
శాంతి శాంతి శాంతి శాంతి
జగమంతా జయిస్తుంది
ఈ స్వప్నం నిజమవుతుంది
ఈ స్వర్గం ఋజువవుతుంది."

ఆ మంచి రోజు కోసం ఎదురు చూద్దాం!



---

## 5వ పంచవర్ష ప్రణాళికలో . .

(15 వ పేజీ నుండి)

ఖర్చు, రూ. 600 కోట్లు పెట్టుబడి, ప్రయివేటు రంగంలో రూ. 2,900 కోట్లు పెట్టుబడి జరుగవలసిందిగా నిర్ణయించబడింది. పోషక పదార్థాలపై రూ. 700 కోట్లు ఖర్చు నిర్ణయించబడింది. నాల్గవ ప్రణాళికలో ప్రభుత్వ రంగం ఖర్చులో వ్యవసాయంపై చేసిన అభివృద్ధి ఖర్చు 20.7 శాతంకాగా, అయిదవ ప్రణాళికలో యిది 19.7 శాతంగా వుంటుంది. అయితే పౌష్టికాహారంపై అయిదవ ప్రణాళికలో హెచ్చు శాతం అభివృద్ధి ఖర్చు వుంటుంది. నాల్గవ ప్రణాళికలో వ్యవసాయ రంగంలో ఫ్యాక్టరీ ఖర్చునను సరించి వచ్చిన మొత్తం అదనపు మూల్యము రూ. 4,169 కోట్లు, మొత్తం అచల పెట్టుబడి రూ. 4,411 కోట్లు కాగా మూలధనం ఉత్పత్తి పెరుగుదల నిష్పత్తి 1.06 అవగా, అయిదవ ప్రణాళికలో మొత్తం అదనపు మూల్యము రూ. 4,249 కోట్లు, మొత్తం అచల మూలధనము రూ. 8,500 కోట్లు మూలధన ఉత్పత్తి నిష్పత్తి పెరుగుదల 200గా వుంటుంది.

వ్యవసాయోత్పత్తుల సేకరణ ధరలు రైతు కనుకూలంగా వుండేటట్లు నిర్ణయించబడి, రైతు విపణి వీధికి వ్యవసాయోత్పత్తులను, ముఖ్యంగా ఆహారాన్ని తగురీతిలో అందించేటట్లు చేయబడుతుంది. వ్యవసాయోత్పత్తి సేకరణ ధరలు ధర-వేతన-ఆదాయ సంతులనాన్ని సాధిస్తూ, ఆర్థికాభివృద్ధికి నిర్ణయించిన నిధుల విలువలను కోసివేయకుండా వుండేరీతిని నిర్ణయించబడగలవు. ఉత్పత్తిని అధికం చేయడానికి అడ్డువచ్చే రీతిని ఆహారపదార్థ సేకరణ ధరలు నిర్ణయించబడవు.

చిన్న రైతుల, ఉపాంత వ్యవసాయకుల, వర్షాధారాని ప్రాంతాల మెట్టప్రాంతాల, గిరిజన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక చర్యలు తీసికోబడతవి. వెనుకబడివున్న ప్రాంతాల అభివృద్ధికి, నీటిపారుదల, వార్తా ప్రసారము, విపణివీధి, విద్యుచ్ఛక్తి, ఆరోగ్య వసతులు మొదలైన సౌకర్యాలను అందించడం ద్వారా వ్యవసాయోత్పత్తుల అభివృద్ధికి తోడ్పాటు యివ్వబడుతుంది. వ్యవసాయాభివృద్ధి, భూసంస్కరణలు, పశుసంవర్ధన, చిన్నతరహా పరిశ్రమలు, సాంకేతిక శిక్షణ వెనుకబడివున్న వివిధ వర్గాల అభివృద్ధికి ఉపయోగించ బడతవి.

అయిదవ ప్రణాళిక నిజమైన ప్రజా ప్రణాళిక కావాలని ప్రభుత్వం కోరుతోంది. అయితే ప్రజలు, ప్రభుత్వోద్యోగులు, పరిపాలన సక్రమంగా కార్యాన్ని నిర్వహించినప్పుడు మానవ కారకం (Human factor) అన్ని విధాల తగిన రీతిని కష్టించి పనిచేసి త్యాగాలకు సిద్ధపడి, వుత్పత్తిని చెప్పినరీతిని పెంపొందించి, పంపిణీని న్యాయసమ్మతంగా జరిపినప్పుడే అయిదవ ప్రణాళిక జయప్రదం కాగలదు. భారతదేశంలో మానవశక్తి సంపద, సంపదను మానవుడు బాగుచేసినపుడు, యిందుకు పరిపాలన అనుభూతిను, బుద్ధిబలము, భుజబలము సహకరించి తోడ్పడినపుడు అభివృద్ధి, న్యాయము, సమానత్వము, పురోగమనము సంప్రాప్తం కాగలవు.



# స్త్రీలు - స్వాతంత్ర్యము

శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి

భారతదేశ నాగరికత ప్రాచీన భరతఖండములో ఆర్యులు తమతో గూడ తెచ్చినదే. ఆర్యులకు పూర్వము మొహెంజోదారో, హరప్పలవద్ద త్రవ్వగా కొన్ని శిథిలములు బయట పడినవి. ఇచ్చటి నాగరికత విశిష్టమైనదయ్యు, ప్రమాణగ్రంథములేవియు లేనందున, వేదకాలమునాటి నాగరికతవలె స్పష్టముగా తెలియుటలేదు. దానికి కారణము, ఆ కాలమందలి నాగరికతను తెలుపు గ్రంథములు లేక పోవుటయే. మొహెంజోదారో, హరప్పల శిథిలముల వల్ల మనకు తెలియునదేమనగా, ఆ రోజులలోనే నగర,గృహనిర్మాణ శాస్త్రములు వికసించియుండెననియు, స్త్రీ, పురుషులు విలాసముగా జీవించుచుండి రనియును, కాని వారిసాంఘిక సంఘములో స్త్రీల కెట్టి స్థానముండెనో, వారి చదువేదియో, భాషయేదియో తెలియరాదు.

కావున ప్రాచీన హైందవ నాగరికతకు పట్టుగొమ్మ, వేదమనియే చెప్పవచ్చును. ఈ వేదములు ప్రపంచవాఙ్మయములో అతి ప్రాచీనములు, అవి ముద్రణలేని కాలమునుండియు, గురుశిష్య సంప్రదాయముతో పొల్లుపోకుండ నేటివరకు గూడ భద్రపరపబడినవి. కావున వేదములే అత్యంత ప్రాచీన ప్రమాణగ్రంథములు.

వేదకాలమునాటి స్త్రీలు సంఘములో గొప్పస్థానము వహించి యుండిరి. వారు విద్యావంతులై పురుషులతో సమాన ప్రతిపత్తిని గలిగియుండిరి. స్త్రీల ఈ స్వేచ్ఛ మనుస్మృతి కాలమువరకు గూడ నిరవచ్ఛిన్నముగ నుండెనని చెప్పవచ్చును. మనుస్మృతియందు స్త్రీ స్థానము గృహకృత్యములు నెరవేర్చుటకొరకే పరిమితమై యున్నది. ఈ ప్రకారము స్త్రీ బాల్యములో తండ్రి, యౌవనములో భర్త, వృద్ధాప్యములో కొడుకుల అండలో నుండవలయుననియు, స్వతంత్రత స్త్రీకి ఏ పరిస్థితులలోను పనికి రాదనియు మనువు తెలిపినాడు. స్త్రీ, కొడుకు, దాసి—ఈ ముగ్గురికి స్వతంత్రముగు హక్కులేదనియు, వారి ఆర్జన సైతము స్వామికే చెందుననియు తెలుపనైనది. కాని మనువు సైతము స్త్రీలు దేవతామూర్తులని "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః" అనెను. తెలుగులో కూడ "కలకంఠికంట కన్నీరొలికిన సిరి ఇంట నుండనొల్లదు సుమతీ," అను సూక్తి కలదు.

వేదకాలములో ఉన్నతముగానున్న స్త్రీ స్థానము, మనువు వరకెందుకు ఈ విధముగా మారినదో తెలియరాదు. ఆర్యులు భరత భూమికి వచ్చిన క్రొత్తలో ప్రత్యేకముగా స్త్రీలకు వేదవిహిత కర్మలలో పాల్గొనుటకు వేదములు నేర్పబనిలేకుండెను. గోష,లోపాముద్రవంటి స్త్రీలు, సూక్తద్రష్టృలై తత్వమునకు సంబంధించిన సంవాదములందు పాల్గొనుచుండిరని తెలియుచున్నది. రాను రాను, వైదిక కర్మలలో ఋత్విజుని ప్రాముఖ్యము పెరిగి, స్త్రీలకు గృహకృత్యముల మూలమున అధ్యయనమునకు సమయము లేకపోయెను.

ఏమైనను వేదకాలమునాటి స్త్రీ సర్వస్వతంత్రురాలై, గృహస్వామినియై వెలసినది. భాగ్యవంతులలో స్త్రీలకు ప్రత్యేకమైన మందిరము లేర్పరుపబడి, అందు లలితకళలను ఆరాధించుచు స్త్రీలు ఇష్టాగోష్ఠులతో కాలముగడిపెడి వారని తెలియుచున్నది. పర్వ సమయములలో, ఉత్సవములలో వారు వీణ వాయించెడివారు, పాడెడివారు, నాట్యముకూడ కులవధువు చేయుటలో తప్పులేదు. ఆ రోజులలో బాల్య వివాహములు లేవు. చరిత్ర కాలములోగూడ ప్రౌఢాంగనలు, స్వయంవరములో నచ్చిన పతిని వరించుట ఆచారమై యుండెను. ఇట్టివే దమయంతీ, ద్రౌపదీ స్వయంవరములు పరదా పద్ధతిని వారెరుగుదురు. తన కూతునకు నచ్చిన వరుని ప్రసాదింపవలసినదిగా తండ్రి సవితను, వేద కాలములో ప్రార్థించెడివాడు. అథర్వణ వేదములో, అట్లు తొందరగా వరుడు దొరకని యెడల ప్రశ్నలు చెప్పించుట మొదలగునవి ఆచారమై యుండెను. అథర్వణ వేదము సామాన్య ప్రజానీకమున కందుబాటులో ఉండి, వారియందు నమ్మకము నుత్పాదింపజేయునదిగా నుండెను. ఆ వేదమునుండియే వశీకరణమంత్రములు, ప్రశ్నలు చెప్పుట మొదలగునవి యన్నియు, నేటివరకును మన సంప్రదాయములో వచ్చినవి. దీనినే ఇంగ్లీషులో "పాప్యులర్ రెలిజియన్" అందురు. అందువలన వేదత్రయమునకున్న ప్రతిపత్తి ఈ వేదమునకు లేదు. కాని ప్రజలలో చాలా మందికి దగ్గరగా వచ్చిన దీవేదమే. ఇందులో ఏ కారణముచేతనైనను స్త్రీ అవివాహితగా నున్న, ఆమెతండ్రిఆస్తిలో భాగమునకు ఆమె హక్కుదారురాలగును అని చెప్పబడినది. ఋగ్వేదమునందుకూడా అవివాహిత స్త్రీకి తండ్రి ఆస్తిలో నాల్గవవంతు చెందునని తెలుపబడి యున్నది.

"స్త్రీలలో చాలామంది, కాబోయే భర్త ధనమును చూచియే అతనిని వరింతురనియు, అందులో నిజముగా కొందరు మాత్రమే

ఆదర్శ వనితయై తాను మనస్సులో వరించిన పురుషుని వరికొంచుచు" అనియు ఋగ్వేదమందలి పదవ మండలములో చెప్ప బడియున్నది. వివాహమును ఆ రోజులలో గూడ ఒక వేడుకయు, వధువు అత్తగారింటికి సాలంకృతగా పంపెడి వారనియు ఋగ్వేదము వలన తెలియుచున్నది. స్త్రీలు శీలవతులై వివాహమును జన్మాంత పవిత్ర బంధముగా భావించి భర్త చేయు వైదిక కర్మలయందు పాల్గొనుచుండిరని వేదముల వలన తెలియును. వేద కాలమందు మతమనగా నేటిహిందూమతము కాదు. నేటి మతము వైదిక 'ద్రావిడ' తూర్పు ఇండియా దీవుల, గిరిజనుల సంప్రదాయములన్నియు కలిసిన కలగూర గంప. వైదిక మతమనగా అగ్ని, వాయువు, వరుణుడు, పృథ్వి, ఇంద్రుడు, సూర్యుడు, ఆకాశము మొదలగు ప్రత్యక్షదైవములను యజ్ఞములలో ఆహ్వానించి, సోమరసము, నేయి వలన వారికి తృప్తి చేసెడివారు. వధువును, అశ్వినులు, పూష, రక్షించవలసినదిగా ఆమె స్వామినీత్వము అత్తింట చెల్లవలసినదిగా ప్రార్థనలు జరిగెడివి. "సంరాజ్ఞీ శ్వశురే భవ, సంరాజ్ఞీ శ్వశ్రువాం భవ, ననాందరి సంరాజ్ఞీ భవ, సంరాజ్ఞీ అధిదేవృషు, స్నుషాణాం, శ్వశురాణాం, ప్రజాయాశ్చ ధనస్యచ," అని వివాహ మంత్రములలో కలదు. ఈ వాక్యములు నేటికిని ఉచ్చరింతురు. అత్తవారింట, మధ్యకాలము నందు వలెగాక, స్త్రీ అత్యంత గౌరవమునకు పాత్రురాలయ్యెడిది, అత్తింటి వారామెను ప్రేమతో చూచెడివారు. భర్త, ఆమెతో చిరకాలము సంసారము చేసి తనకు, ఇంటికి స్వామిని చేయ వలసినదిగా అర్యముని ప్రార్థించెడివాడు. అర్యము డనగా సూర్యుడు.

రానురాను బహుభార్యాత్వము ప్రబలినది. ఒక తెగయొక్క పరిపుష్టత అందలి బహుభార్యాత్వము వలననే తెలియునని శాస్త్రము. ఎక్కువ భార్యలను పోషించ గలిగిన స్తోమత గలవాడే అంత మందిని పెండ్లాడును. కావుననే "సిరిగలవానికి చెల్లును తరుణుల పదియారు వేల దగ పెండ్లాడన్ తిరిపమునకిద్దరాండ్రా పరమేశా గంగ విడుము పార్వతి చాలున్" అని శ్రీనాథుని చాటువు చెప్పుచున్నది. మహమ్మదీయుల యందు గూడ ఈ బహు భార్యాత్వము కలదు. ఇప్పటికిని వెనుకబడిన జాతులలో బహు భర్తృకత్వము కలదు. ఒక స్త్రీని ఒక పురుషుడు పోషింపలేనప్పుడు ఆమె బహు భర్తృక యగును. వేశ్యా వృత్తితో దీనికి పోలికలేదు. మనకు గల సాహిత్యమంతయు ఒక్కచో కూర్చిన, బహు భర్తృకత్వ మొక్క ద్రౌపది యందే కానవచ్చును. మరెక్కడను ఇటువంటి దృష్టాంతము లేదు. విధవా స్త్రీలకు ద్వితీయ వివాహము మహమ్మదీయులకు శాస్త్రీయముగా విహితము, వేదకాలమునాటి స్త్రీ తన సపత్నుల నందరిని పార ద్రోలి భర్తను తన వానిగ జేయుమని ప్రార్థించెడిదట. సత్యభామ వంటి స్త్రీలు సపత్నులెందరున్నను వారందరిలో తానే గొప్పదిగా గర్వపడుట కూడా ఇందుకు ప్రమాణము. సమష్టి కుటుంబము నందలి ఐక్యమును కాపాడి, వధువు యొక్క జీవితము శాంతముగా గడపవలెనని తల్లిదండ్రులు వధువును ఆశీర్వదించి అత్తవారింటికి పంపెడి వారని అథర్వణవేదములో గలదు. స్త్రీ కుటుంబములోని వారికందరికిని అనుకూలురాలై పతివ్రతయై యుండవలెనని యున్నది.

ఇక్కడి నుండియే తరువాతి కాలములో విపులముగా వివరింపబడిన ఆదర్శ స్త్రీత్వమునకు పునాదులు వేయబడినవి. అథర్వణ వేద క్రోడీకరణము, ఋగ్వేదము తరువాతనే అని తెలియుచున్నది. ఆర్య స్త్రీ, సంపద వచ్చినను, ఆపద వచ్చినను, సమముగా నెదుర్కొనుచుండెడిది. ఆదర్శ నారీత్వమంతయు గ్రుచ్చి గ్రోగు చేయబడినదా యనునట్లు సీత వాల్మీకిచే చిత్రింప బడినది. వేదములయందు సీత నాగటి చాలుగా ఇంద్రునిచే, పూషచే రక్షింపబడి, ప్రతి సంవత్సరము సస్య సంపదలనివ్వ వలసినదిగా కోరబడెడిది, ఇదే సీత రామాయణములో నాయికయై జగదారాధ్యురాలైనది. యజుర్వేదము నందు సైతము సీత వర్ణింపబడినది. ఆ పాత్రకు అంతటి ఔన్నత్యము వాల్మీకి యిచ్చుటకు అటువంటి స్త్రీల నతడు సంఘములో ఆ కాలమున చూచుచుండెడివాడు అని మనకు గోచరించును.

ద్రౌపది పలుచోట్ల ధీరోద్ధతగా చిత్రింపబడినను ఆమె పాత్ర అత్యుదాత్తము. తనకొడుకులైన ఐదుగురు ఉపపాండవులను చంపిన అశ్వత్థామను చంపవద్దని అనుచు "పతివ్రతయైన గౌతమి (అశ్వత్థామ తల్లి) పుత్రశోకమును భరింపకుండుగాక" యని ఒక సూక్తమందు "ఓదేవతలారా మీకు బలిని సమర్పించు ఈ దంపతులకు అన్నము సమృద్ధిగా నుండు గాక" యని చెప్పబడినది.

వైదిక మతములో ప్రధానమగు మరియొక అంశము విధవా పునర్వివాహము. ఋగ్వేదమునందలి ఒక సూక్తములో "భర్త శవముపద్ద కూర్చొని ఏల విలపించెదవు. నిన్ను పెండ్లియాడి భరించ గలిగినవాని భార్యవు కమ్మని" యున్నది. వేదకాలములో స్త్రీ పునర్వివాహ మున్నదనుటకు "ధిధిష (విధవను పెండ్లియాడిన వాడు), పరపూర్వ (ద్వితీయ భర్తృక) పౌనర్భవ (ఒక స్త్రీకి రెండవ భర్తయందు కలిగిన కొడుకు) అను పదములు సంస్కృత భాష యందుండుటయే తార్కాణము. ఒక స్త్రీకి పదిమంది భర్తలున్నచో పదవవాడు బ్రాహ్మణుడైన, ఆమె బ్రాహ్మణ యువతి యగునని యున్నది. మనుస్మృతియందు సైతము సహగమనము లేదు. ఆ ఆచారమెట్లు వచ్చెనో కాని మధ్య కాలమునందు వచ్చెను. అది మొదలు పతివిహీనమగు బ్రతుకు దుర్భరమై స్త్రీలు భర్తతో దేహత్యాగము చేసియుందురు.

యాజ్ఞవల్క్య స్మృతియందు భర్తృవిహీనయగు స్త్రీ కొడుకులతో సహభాగిని యగునని యున్నది. ఈ శాసనమును ఇప్పటి మన ప్రభుత్వముకూడ అమలు పరచినది. ఇక ఆ కాలమున స్త్రీల వైదుష్యమును విచారించిన, స్త్రీలు, పురుషులతో సమానముగా పవిత్రలై అధ్యయనము చేయుచుండిరి. భిక్షాటనము సైతము చేయుచు బ్రహ్మచర్యము నవలంబించుచుండిరి. యాజ్ఞవల్క్యుని భార్యయగు మైత్రేయి, అతడు తపోవనమునకు పోవుచు తన ధనమును విభజించు పట్ల, సపత్నియగు కాత్యాయనికి నశ్వరమైన ధనమునిచ్చి తనకు బ్రహ్మవిద్య నుపదేశింపవలసినదిగా కోరును. యాజ్ఞవల్క్యునితో జనకుని కొలువు కూటములో గార్గి వాదమునకు దిగును. అప్పుడతడు ఓ గార్గీ ఇంక ఎక్కువ వాదించకుము. నీవడిగిన ప్రశ్నపై మరియొక ప్రశ్నలేదు, అనగా అప్పుడు గార్గి మౌనము వహించును. పాండ్యరాజుల రాజధానియగు మధుర స్త్రీలచే పాలింపబడెడిదని క్రీస్తుకు

కుమ్మరి మొల్ల రామభక్తయై రామాయణ సుధారసమును ఆంధ్రావనికి పంచిపెట్టినది. ఆధునిక ఆంధ్ర మహిళలలో ప్రజాసేవ, సాహిత్య సేవ చేయువారు చాలామంది నేడు కలరు. ఉత్తర దక్షిణ దేశములలో స్త్రీలు తర్క, వ్యాకరణాది శాస్త్రములలో విదూషీమణులై సభలలో శాస్త్రార్థములు చేయువారు కూడా కలరు. కొచ్చిన్ రాజు కూతురు తర్క పండితురాలు. ఉత్కళములోగూడ ఒక విద్వాంసు రాలిని నేనెరుగుదును.

సిరిమావో బండారనాయకే ప్రధానమంత్రిణి నేడు కాలేదా ! ఆంగ్ల చక్రవర్తినుల విషయము క్రొత్తదికాదు. రాష్ట్రపితయగు మహాత్ముని బోధన బలమువలన మహిళా లోకము జాగృతమై ఆయ నకు అండగా నిలిచినది. ఇప్పుడు సాంకేతిక (టెక్నికల్) విద్యలను కూడ స్త్రీలభ్యసించుచున్నారు.

హంసరాజ మెహతా, రాజకుమారి అమృతకౌర్, ఇందిరా గాంధీ, సూసుమా బేగం, నేడు లక్ష్మీదేవి మొదలగువారు ఉన్నత పదవులందు బాధ్యతా పూర్వకముగు పనులను నిర్వర్తించుచున్నారు. ఎందరో శాసన సభ్యురాండ్రుగా దేశసేవ చేయుచున్నారు.

ఇక కళల విషయము దీసుకొనిన కళలకు స్త్రీ పుట్టినిల్లన వచ్చును. లలిత కళలేకాక చతుష్షష్టి కళలలో, గృహకృత్యము లెన్నియో చెప్పబడినవి. స్త్రీ కళాస్వరూపిణియైనను కళలలో అత్యుత్తమ స్థాయినందుకొన్నవారు పురుష లనక తప్పదు. వంట యందు కూడా పురుషులే అగ్ర తాంబూలమున కర్హులుగా వెలసినారు. నలభీమ పాకమని సుప్రసిద్ధమగు నానుడి కలదు. నాట్యవేదబ్రహ్మ భరతమునియైనను, నాటకము అప్సరసలులేనిదే రక్తి కట్టలేదు. కావుననే ఊర్వశి లక్ష్మి పాత్ర వహించుటకై నియోగింపబడి, పురుషోత్తమ అనుటకు బదులు పురూరవా యనుట వలన శప్తురాలైన దనుట కాళిదాసు విక్రమోర్వశీయము వల్ల తెలియును. అచ్చటచ్చట సంస్కృతములోను ఇదితర భారతీయ వాఙ్మయములందును కవ యిత్రులు కాననగుదురు. కాని ప్రపంచ విఖ్యాతినందినవారులేరు. ఆంధ్ర దేశములో త్యాగయ్య, క్షేత్రయ్య మొదలగు గాన సరస్వతులే కాని ఆడువారు వారి యీడుకురాదగినవారు కానరారు. నైసర్గిక ముగా అబలయగు స్త్రీ ఆటలు మొదలగు శారీరక వ్యాయామము లందు వెనుకబడియుండుట సహజము. లేడీడాక్టరులెందరుండి యున్నను అత్యున్నతస్థాయి నందుకొనినవారు స్త్రీల రోగములకు సంబంధించిన శాఖలలో గూడ పురుషులే. మన స్వతంత్ర భారతము ఇరువదవ శతాబ్దిలో స్త్రీ స్వాతంత్ర్యమనగా పై లోటును తీర్చుటయే. పాఠశాలలలో, కళాశాలలలో యన్.సి.సి. లో స్త్రీలుచేరి అందు నిష్ఠతో కృషి సలుపవలెను.

సృష్ట్యాది నుండియు స్త్రీ పురుషనామములు పరస్పరము లంకె గలిగియున్నవి. స్త్రీ ప్రకృతి స్వరూపిణి, పురుషుడు పురుష స్వరూపుడు. ప్రకృతి-పురుషసంయోగము లేనిదే సృష్టి జరుగదు. చతురానను డాననమునందు సరస్వతిని, దామోదరుడు వక్షమునందు లక్ష్మిని, మహాదేవుడర్ధాంగమునందు పార్వతిని ధరించుకొనలేదా! స్త్రీ రెచ్చిపోయినచో శక్తి స్వరూపిణియై వేయి ఏనుగుల బలముతో ఎంతటి పనియైనను చేయగలదు. అప్పుడామె అబలాత్వ మెక్క డికి పోవునో తెలియదు. ఒక కుటుంబము స్వర్గతుల్యమైనను నరకతుల్యమైనను అది అంతయు ఆ గృహిణిపై ఆధారపడి యుండును. అట్టి గృహిణి విద్యా గంధశూన్యయై, నాలుగ్గోడల మధ్యనే యొదిగిన నెట్లుండునో ఊహింపనగును. "ఆధునిక విద్యా భ్యాసము వలన భారతీయ సంప్రదాయము చెడిపోవును, తద్వారా స్త్రీలు అనర్థములకు దారి తీసినవారగుదురు, కాన స్త్రీ విద్య పనికిరాదు" అను వారిప్పటికిని కొందరున్నను ఆ విశ్వాసము ఇప్పటికే సమయ స్ఫూర్తి లోకజ్ఞానము కల విద్యావంతులైన స్త్రీలచే పోగొట్టబడిన దనవచ్చును. అన్నిటికన్నను గొప్ప ప్రయోజనము, వేశ్యావృత్తి నిర్మూలనము వలన కలుగునని అనవగును. సంసారము, క్రొత్త వాతావరణము, మంచివారి సాహచర్యము, విద్యాజ్ఞానము వీనివలన పరి స్థితుల నర్థము చేసుకొని వేశ్యలు తాముచేయు పని యెంత నీచ మైనదో తెలిసికొని నూటికి ఏబది మందియైనను మార్పు చెందుట కవకాశము కలదు.

భారత దేశమందున్న దారిద్ర్యము నిర్మూలింప బడవలెనన్న మనదేశము స్వయం సమృద్ధము గావలెను. స్వయం సమృద్ధ మగుటకు స్త్రీ కూడా పురుషునితో సమానముగా పని చేయవలెను. ఇప్పటికే విదేశవస్తువుల దిగుమతులను మనదేశము చాలావరకు రద్దు చేసినది. ఇకపైన మనదేశములో ఉత్పత్తి పెరిగి ఆ వస్తువు లితర దేశములకు ఎగుమతియైన యెడల మనకు ఆర్థికస్తోమత పెరు గును. తరతరాలుగా భారతదేశములో నెలకొనిన చేతివృత్తులకు విదేశములలో గొప్పపేరు కలదు. చేతిపనులను, గృహపరిశ్రమలను అభివృద్ధి పరచవలెననిన స్త్రీలు ఎక్కువగా పాటుపడవలెను. ఈ విధ ముగ చేసినచో తమను, తమకుటుంబమును, తమదేశమును స్త్రీలు ఉన్నత స్థాయికి తెచ్చిన వారగుదురు. అణుయుగమైన 20వ, శతాబ్దిలోకూడ గృహ పరిశ్రమలకుండు ప్రాధాన్యము చెదరలేదు. మనదేశములో నేత్రబట్టలు, చందనము, దంతము సామానులు తోలుపరిశ్రమ, బొమ్మలు మొదలగునవి ఎంతయో నాణ్యమైనవై పాశ్చాత్యుల నాకర్షించుచున్నవి. ఇవి యన్నియు బాగుగా పునరుద్ధ రింపబడవలెననిన మన మహిళాలోకము ముందుకువచ్చి స్వతంత్ర ముగా పని చేయవలసియున్నది. ఇంటగెలిచి రచ్చగెలువ వలెనని సామెత గలదు. కనుక మన స్వాతంత్ర్యము గట్టి పునాదులపై నిలువవలెనన్నచో అది స్త్రీలమూలముననే జరుగగలదు. స్వాతంత్ర్య ఫలము దేశమునకు స్త్రీలే అందివ్వవలెను. కనుక స్త్రీలకును స్వాతంత్ర్యమునకు అవినాభావసంబంధము కలదు. స్వతంత్ర దేశము రాజకీయ, సాహిత్య, సాంఘిక మర్యాదలను కాపాడ వలసిన వారు స్త్రీలే. నేటి మన స్వతంత్ర భారతీయులలో రాజకీయముల వలెనే సాంఘిక సాహిత్యరంగములు గూడ ముఠాలలో పడిపోయినట్లు తోచుచున్నది. సేవాధర్మము లేని వారికి శాసనములో స్థానము సంఖ్యాబలముచే లభించినట్లే సాహిత్యపు లోతులు రుచి యెరుగని అమాయకులకు అగ్రస్థానము. అకాడమీలలోను తదితర సాహిత్య సంస్థలలోను లభించుచున్నది. ఇట్టి వాతావరణమే సాంఘికవ్యవస్థ లోను గోచరించుచున్నది. స్వతంత్రదేశములో ఇట్టి చెడుగులను అరి కట్టి మహిళాలోకము దేశమును ఆదర్శవంతముగా చేయుటకు ముందుకు వచ్చి అన్ని రంగములలోను దేశ పురోభివృద్ధికి తోడ్పడ వలసిన సమయము ఆసన్నమైనది. 

# తెలుగు వారి ఆచారాలు

శ్రీమతి వేదవతీదేవి

మండించి వేస్తున్న మండు వేసవి మధ్యాహ్నం హఠాత్తుగా ఒక చిరుగాలి వీచినట్లైంది. ఆ మంద పవనం చల్లగా లోపలకు దూరి నా ఒంటిని స్పృశించేసరికి ప్రాణం హాయి అనిపించి లేచి వరండాలోకి వచ్చాను.

నింగిలో నుంచి తొలకరి తొలిమబ్బు ఒకటి తొంగి చూచింది.

నాకు ఆ చక్కని దృశ్యం చూసేటప్పటికి గుండెల నిండుగా ఏదో రాగం నిండిపోయింది.

"ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్ట సానుం
వప్రక్రీడా పరిణత గజ ప్రేక్షణీయం దదర్శ"

మేఘసందేశంలోని ఈ శ్లోక పాదం గుర్తుకు వచ్చింది నాకు. తలఎత్తి నీలాంబరంలో నీలాలు వెదజల్లుతున్న మబ్బు పిల్లను సమార్ద్రింగా పరామర్శించాను.

ఓహో ! ఆషాఢ మాసం వచ్చేసింది! ఈ వేళ ప్రథమ దివసం కాబోలును!

విరహాగ్నిలో వేగిపోతున్నాడు యక్షుడు. ఎక్కడో దూరానఉన్న ప్రియురాలికి ప్రేమ సందేశం మోసుకు పోవటానికి ఈ ఆషాఢ మాసపు తొలకరి మేఘం ఉపకరణం అయింది కాబోలు!

ఉన్నట్లుండి కారునల్లగా వ్యాపించి ఆ మబ్బు బాలిక స్నిగ్ధ మందహాసం చేసినట్లు, సన్నని మెరుపుతీగె ఒకటి లాస్యంచేసి మాయమయింది.

గజరాజు తెల్లని దంతాలతో అడ్డంగా రాపాడినట్లు ఆ శంపాలత ఆ విరహార్తుడికి కనిపించిందట !

నాకు నవ్వువచ్చింది. అసలు ఈ ఆషాఢ మాసం కూడా అటువంటిదే కదా! వస్తూ వస్తూనే క్రొత్త జంటల్ని వేరుచేస్తుంది. నవ దంపతుల మధ్య అడ్డుగోడగా వెలుస్తుంది !

ఆషాఢం వచ్చిందంటే ఆంక్ష పెట్టినట్లే !
అత్తా అల్లుడూ గడప దాటకూడదు!
అత్తా కోడలూ ఎదురు పడకూడదు !
ఏమిటో ఈ ఆచారం!
ఎందుకో ఈ ఆంక్ష !

పాపం, పిల్ల పుట్టింట్లోనూ, అల్లుడు అడంగులోనూ ఆషాఢాన్ని శాపనార్థాలు పెట్టుకుంటూ కాలక్షేపం చేయవల్సిందే !

నేను చప్పున లోపలకు పరిగెత్తి బామ్మమీద పడ్డాను. రాట్నం వడుకుతూ ఉన్న బామ్మ—

"నీ తొందర దొంగల్తోలా! ఏం పిల్లవే నువ్వు!"...అన్నది

"నాకోసంగతి చెప్పాలి బామ్మా! ఆషాఢ మాసంలో మొగుళ్లూ పెళ్లాలూ—అంటే కొత్తగా పెళ్లయిన వాళ్లే—ఒక దగ్గిర ఎందుకు ఉండకూడదు! అత్తా అల్లుడూ—అత్తాకోడలూ ఒక గడప ఎందుకు దాటకూడదు!"...అన్నాను.

బామ్మను నేనీప్రశ్న ఎంతో ధీమాగానే వేశాను. ఎందుకంటే నాకు వచ్చే ఈ సవాలక్ష సందేహాలన్నిటికీ సమాధానం చెప్పగల ఒకే ఒక సోర్స్ (Source)—బామ్మ—అని నాకు బాగా తెలుసు.

ఆచారాలు బాగా పట్టుకుంటుంది ఆవిడ. అడుగడుక్కూ ఆంక్షలు పెడుతూ ఉంటుంది. ప్రతిదానికీ—'మంచిదీ'—'మంచిది కాదూ'-అంటూ సిద్ధాంతాలు చెబుతూఉంటుంది. ఆ 'మంచీ—చెడూ' బామ్మ దృష్టిని దాటిపోవటం చాలా అరుదు.

బామ్మ నా వంక చూచి నవ్వి అన్నది.

"పెళ్లిళ్లు ఎక్కువగా మాఘ మాసంలోనే చేస్తుండేవాళ్లు కదుటే వెనక! పెళ్లయిందగ్గర నుంచీ కొత్త అల్లుడు మనుగుడుపులు కుడుస్తూ అత్తవారింట్లో తిష్టవేసుకుకూర్చునే వాడు. ఆరు నెల్లయినా అల్లుడు గడప దాటకపోతే, అమర్యాద లేకుండా అతగాణ్ణి సాగనంపటానికి మనవాళ్లు ఈ ఎత్తువేశారు!"

ఆరు నెలలు అత్తారింట్లో మఠం వేసుక్కూర్చునే ఆ వెనుకటి అల్లుళ్లకు పనీ పాటా ఏమీ ఉండేది కాదా ఏమిటి! అసలు వాళ్లకు అన్నాళ్లు అత్తారింట్లో తిని కూర్చోవటానికి అభిమానం అడ్డు వచ్చేదికాదా! వాళ్లకు కాలం ఎట్లా గడిచేది ?...అన్నీ సందేహాలే నాకు.

"వెనుకటి వాళ్లు అంతేనే పిల్లా ! ఈ చదువులూ, ఉద్యోగాలూ అప్పుడెక్కడవీ ! శలవు మంజూరు అయిందనీ, కాలేదనీ గొడవ ఉండేదికాదు. వ్యవసాయపు పనులవీ ఉంటే, ఇంటికయిన తండ్రో, అన్నగారో చూచుకునేవారు. ఇహ, అత్తారింట్లో అన్నాళ్లు ఉండటానికి అభిమానం గురించి అంటావా ! పెళ్లయిన ప్రతి కొత్తల్లుడూ చేసే పనే అది ! కాలం గడవటం అంటావా ! కొత్త పెళ్లాంతో కాలం గడపటానికేముందే ! పగలంతా షైలా పచ్చీసుగా ఊళ్లో షికార్లు తిరగటమూ, రాత్రి అయేప్పటికి పెళ్లాంతో సరసాలు మొదలు పెట్టటమూ"... అంటూ నా సందేహాలన్నిటికీ సమాధానాలు చెప్పింది బామ్మ.

"ఓహో అత్తారింట్లో హనీమూన్ అన్నమాట !"

"ఏమి హాల్లీముల్లీయో కాని, ఆరునెల్లూ ఆ అల్లుణ్ణి [illegible] యించేటప్పటికి ఆ అత్తారికి మాత్రం తలప్రాణం తోకకు వచ్చేది."

"ఏం!"...అన్నాను.

"ఇప్పట్లాగా అనుకున్నావా ఏమిటే పిల్లా! అల్లుడింటో ఉన్నాడంటే ఎంత సందడి! ఎంతపని! ఎన్ని మర్యాదలూ! ముప్పూటా అన్నాలు తినేవాళ్లు అప్పటి అల్లుళ్లు. ముప్పూటా వంట చేసి వేడివేడిగా వడ్డించ వలసిందే! కాఫీలూ గట్రా లేకపోయినా, గారెలూ, బూరెలూ, కుడుములూ, సున్నుండలూ, ఇట్లా ఆ రోజుల్లో చేసుకునే పిండి వంటలన్నీ చేసి పెట్టేవాళ్లు. వారం వారం మంగల్ని పిలిపించి, నూనె పట్టించి, నలుగు పెట్టించి తల అంటించే వాళ్లు. పండగొస్తే కొత్త బట్టలవీ సరేసరి!"

మరో మాటలో చెప్పాలంటే! ఆ కొత్తల్లుడు అత్తారింటో రాజభోగాలు అనుభవిస్తూ ఉండేవాడు. ఆ భోగాల్నీ, అంతకు మించి కొత్త పెళ్లాన్నీ వదిలిపెట్టి పోవడం మహాకష్టంగానే ఉండి ఉంటుంది పాపం ఆ అర్భకుడికి!

అందుకే మనవాళ్లు ఆషాఢ మాసం వంక పెట్టుకుని ఈ ఆంక్ష ఏర్పాటు చేసుకుని ఉంటారు! అదీ సంగతి! అల్లుడికి అలక రాకుండా తెలివిగా ప్లాను వేశారు! అదే మనకు ఆచారంగా వచ్చి ఉంటుంది.

## తుమ్ములు

తుమ్ములను గురించి బామ్మ పెట్టే ఆంక్షలు ఇన్నీ అన్నీ కావు! అసలు తుమ్ములనేవి మనకెవరికీ చెప్పిరావుకదా! నాకు మరీని! అవి బొత్తిగా అసంబద్ధమైన సమయాల్లోనూ, అనువుగాని స్థలాల్లోనూ నన్ను పట్టుకుని వేధిస్తుంటాయి.

బామ్మ అలా వసారాలో కూర్చుని రాట్నం వడుకుతూ వుంటే, గడపమీద కూర్చుని ఆవిడతో ముచ్చట్లాడుతూ కూర్చున్నప్పుడు నాకు ఒకటీ అరా తుమ్ములు రావటం కద్దు! అందుకు పరిహారం బామ్మ చటుక్కున చేసేస్తుంది. చను చేస్తున్నపని ఆపి, లేచి వెళ్లి ఇన్ని నీళ్లు చేత్తో పట్టుకు వచ్చి నానెత్తిన చిలకరిస్తుంది.

"ఏమిటమ్మా ఇదీ!" ... అంటే,

"అయ్యో! గడపగండం కాదుటే!" ... అంటుంది.

ఎప్పుడైనా దొడ్లో రోటిమీద కూర్చుని తుమ్మినా అంతే! రెండు బియ్యపుగింజలు తెచ్చి నా నెత్తిన చల్లుతుంది. దానితో ఆ తుమ్ముకు పరిహారం అయినట్లే ఊపిరి తీసుకుంటుంది.

ఇహ తుమ్మడానికి బొత్తిగా అసందర్భమైన సమయాలు ఆవిడ దృష్టిలో వేరే ఉన్నాయి. ఎవరైనా ఇంట్లోనుంచి బయలుదేరే వేళకు అపుకోలేని తుమ్ము వస్తే, వాళ్లప్రయాణం విధిగా ఆపు చేయిస్తుంది. వాళ్లలోపలకు వచ్చి కాళ్లూ చేతులు కడుక్కుని పుక్కిలించి ఊసి, పసిపిల్లని మాయ చేసినట్లు ఆ తుమ్ము దుష్ఫలితాన్ని మాయచేసి, అప్పుడు అడుగు బయట పెట్టవలసిందే!

ఏదైనా శుభకార్యం జరుగుతూ ఉన్న సందర్భాల్లో కూడా బొత్తిగా సమయ సందర్భాలెరగని తుమ్ము వస్తూ ఉంటుంది నాకు. ఆపుకుందామని చేసిన ప్రయత్నం విఫలం అయి, ముఖం ఇంత లావున కందిపోయి, వికారంగా అయినా కూడా, ఎల్లాగూ అది బయటకువచ్చి తీరుతుంది.

ఆ సమయాల్లో ఏమి చేయటానికీ వీలుగాక, బామ్మ నావంక కొరకొరా చూస్తుంది.

నాకు నెలకొక సారయినా, వంతుగా వచ్చి పోతూ ఉంటుంది జలుబు జ్వరం. వస్తూ వస్తూ, తుమ్ము తెరల్ని కూడా వెంటేసుకు వస్తుంది. అందుకే, ఈ తుమ్ముల విషయంలో బామ్మకు నామీద తరచుగా బోలెడు కోపం. అసంతృప్తీ కలుగుతూ ఉంటుంది!

సైన్సు ఈ తుమ్ముల్ని గురించి చెప్పేకథ వేరుగా ఉంటుందని నాకు తెలిసినా, బామ్మ ఎదుటపడి నా సిద్ధాంతాన్ని చెప్పగలిగే సాహసం లేదు నాకు!

చిన్నప్పుడు ఆడుకుంటూ, గెంతుతూ, కాళ్లార జాపుకుని లోకాభి రామాయణంలో మునిగి పోయిన పెద్ద వాళ్ల కాళ్ల మీదుగా దాటి పోయే వాళ్లం. బామ్మ అది చూచి భగ్గుమనేది. "అలా కాళ్లు దాట కూడ దర్రా" ... అంటూ చెయి పట్టుకుని తీసుకువచ్చి, మళ్లీ ఆ కాళ్ల మీదుగా వెనక్కు దాటించేది. అప్పుడదేమిటో తెలియక పోయినా, మొన్నీ మధ్య అందులో విశేషం ఏమిటని బామ్మని అడిగితే—ఇలా చెప్పింది.

కాళ్లు దాటించుకున్న వాళ్ల అయిదోతనం పోయి దాటిన వాళ్లకు వస్తుంది! చిత్రమైనది ఈ అయిదవ తనం—అనిపిస్తుంది!

తల అంటు కోవటానికి నాకెప్పుడూ సమయం కుదరదు! జలుబులేని సమయం ఎప్పుడో చూచుకుని, తలంటుకుందామని మాడున ఆముదం పెట్టుకున్నానా, బామ్మ చూచిందంటే చేతిలోపని మానేసి, కొంపలంటుకు పోయినట్లు పరుగెత్తుకు వస్తుంది. చేతినిండా ఆముదం వంపుకుని మాడుకి పట్టించి మర్దన చేస్తుంది!

"ఎన్నిసార్లు చెప్పానే పిల్లా నీకు ఎవరికి వారే నెత్తిన నూనెపెట్టుకో కూడదని!" ... అంటూ మందలిస్తుంది.

ఆముదం నెత్తిన పెట్టేముందు వేలితో ఒక్కచుక్కనూనె తీసి నేల రాలుస్తుంది! అది నేల తల్లికి నైవేద్యం కాబోలు!

## శకునాలు

శకునం చూచుకుని బయలు దేరటం మనకు ఇప్పటికీ ఆనవాయితీలో ఉన్న ఆచారమే! ఒంటి బ్రాహ్మణుడు, పిల్లి, వితంతువు, కొత్తకుండలు—ఇవన్నీ ఎదురు రాకూడని నిషేధపు శాల్తీలు, వాటి ఖర్మ కాలి అవి ఎదురువస్తే, ఆ ప్రయాణం అంతటితో ఆపుకోవటమో—మరీ తప్పనిసరి అయితే, లోపలకువచ్చి కాళ్లూ చేతులూ కడుక్కుని కొంతసేపు ఆగి మళ్లీ ప్రయాణం చేయటమో—చేస్తారు మనవాళ్లు.

ముత్తయిదులో, పసిపిల్ల తల్లో, మజ్జిగ కుండతో గొల్లెతో ఎదురువస్తే, ఆ వెళ్లిన కార్యం ఘంటా పథంగా సానుకూలపడుతుందని మన వాళ్ల ఊహ.

ఇది వట్టి ఊహో, లేక గట్టిగాథో—ఎవరికి వారే అనుభవంలో తెలుసుకోవల్సిన విషయం.

అలా మంచి శకునం చూచుకుని వెళ్లే ఆసామిని

"ఎక్కడికి?" ... అంటూ కట్టుకున్న పెళ్ళామైనా అడక్కూడదు! అడిగితే ఆ పని అంతటితో అఖరయినట్లే!

ఆ ప్రయాణానికి ముఖ్యమైన అడ్డంకులు అష్టమి నవములు! ఇవి ఏ శుభకార్యానికీ పనికి రాని ఉట్టి శనిగ్రహపు తిథులు!

మరి త్రేతాయుగంలో రామచంద్రుడికీ, ద్వాపరంలో కృష్ణమూర్తికీ—అవతారం ఎత్తటానికి ఈ రెండు తిథులే ఎందుకు కావలసి వచ్చినాయో! భగవత్స్వరూపులు వాళ్ళు. ఏదో విశేషం లేకపోతే, ఆ పుణ్యమూర్తులు తమ అవతరణానికి ఆ రెండు దినాలూ ఎన్నుకుని ఉండరని నా నమ్మకం!

ఆ మాట నేనన్నానంటే, బామ్మతో మరో వివాదానికి నాందీప్రస్తావన చేసుకున్నానన్న మాటే!

## ప్రయాణాలు

ఆదివారం పడమటి ప్రయాణం చేయకూడదని కూడా అప్పుడప్పుడూ అంటూ ఉంటుంది బామ్మ.

"రైళ్ళూ, బస్సులూ, విమానాలూ ఏవైపుగా ప్రయాణం చేస్తున్నాయో అంచనాలు కట్టి ప్రయాణం కుదుర్చుకోవటం ఎవరికి సాధ్యం!"... అని నేను కొంటెతనానికి అంటే,

"అంత తూర్పూ పడమరా తెలియకుండా పోతుందా ఏమిటే నీకు!"... అంటూ గదమాయిస్తుంది.

అలాగే పొరపాటున ఆదివారం పూట తలంటుకుందామని సన్నాహం చేశానా బామ్మ చీవాట్లు తప్పవు.

"ఆడపిల్లలు ఆదివారం తలంటుకుంటే ఆవగింజంత అయిదవతనం తక్కువవుతుంది!" ... అంటూ గదుము కుంటుంది.

"మరి మగవాళ్ళు అంటుకుంటేనో!"... అని నేను సవాలు చేస్తే,

"ఆయుర్దాయం తరుగుతుంది" ... అంటూ తకీమని సమాధానం చెబుతుంది.

హతోస్మి! ఆదివారం తెచ్చిపెట్టేపాట్లు అన్నీ ఇన్నీకావు అయితే!

బామ్మకు ఇంచుమించు ప్రతి వారమూ ఏదో ఒకపని చేయటానికి నిషేధమైనదిగానే ఉంటుంది!

మంగళవారం వస్తే పాతగుడ్డలు కుట్టుకో కూడదంటుంది! మంగళవారం మంగలంపెట్టి వేయించ కూడదు.

మంగళ బుధవారాలు మంచాలు బిగించకూడదు!

శుక్రవారం పసుపు కొట్టుకోకూడదు!

ఇలా చెప్పకుంటూ పోతే, బామ్మపెట్టే ఆంక్షలకు లెక్కే లేదు!

మంగళవారమో, శుక్రవారమో, అష్టమిపూటో, గాజుల సెట్టి వచ్చాడని మోజుగా గాజులు తొడిగించుకోబోతే, వల్లమాలిన కోపం వస్తుంది బామ్మకు, ససేమిరా వల్లకాదంటుంది.

బస్తీలో షాపులకు వెళ్ళి అన్నివస్తువుల్లాగా గాజులు కూడా కొనితెచ్చుకొనే ఇప్పటివాళ్ళకు బహుశా ఈ ఆంక్ష తెలిసి ఉండకపోవచ్చు.

అష్టమి అమావాస్య వస్తే, కొత్తమడత విప్పి, కొత్త బట్టలు కట్టుకోనివ్వదు బామ్మ.

ఇలా ప్రతి పనికీ "కాదూ, కూడదూ, వల్లకాదు ..." అంటూ అడ్డం వచ్చే బామ్మని చూస్తే ఒక్కొక్కసారి చిరాకుగానే ఉంటుంది.

కానీ, ఏంచేస్తుంది పాపం ఆవిడ! ఈ ఆంక్షలన్నిటికీ కర్తృత్వభారం ఆవిడదికాదు పాపం! ఏనాడో మనవాళ్ళ తమకు తామే విధించుకున్న కట్టుబాటులివి. వాటిని తుచ తప్పకుండా అనుసరించటం మాత్రమే ఆతరం వాళ్ళకు తెలుసు.

ఆ నమ్మకాలూ, ఆచారాలూ ఒక్కొక్కసారి చిత్రంగా కనిపిస్తాయి. స్థూలంగా చూస్తే, ఈ తరం వాళ్ళకు ఇవంతా—"మూఢనమ్మకం—చాదస్తం—సింగినాదం—జీలకర్ర—" ... అనిపించేంత విచిత్రంగా ఉంటాయి. కానీ, ప్రతి చాదస్తానికీ ఏదో ఒక మూలకథ ఉంటుందనే నా నమ్మకం. ప్రతి ఆచారానికీ కాకపోయినా కొన్నిటికైనా శాస్త్రం జవాబు చెపుతుందని నా విశ్వాసం. ఆ చాదస్తానిక్కానీ, ఆ ఆచారానిక్కానీ కారణ భూతమైన మూలకథ వర్తమానంలో మనకు వర్తించేదీ కావచ్చును, కాకనూ పోవచ్చును.

ఇంట్లో బామ్మ నడయాడుతూ ఉన్నదీ అంటే—ఈ "సింగినాదాలూ—జీలకర్రలూ"—కూడా నడయాడుతున్నట్లే! అందుకే బామ్మను చూచినప్పుడల్లా నాకు మన తెలుగు ఆచారం ఎదురు వచ్చినట్లుంటుంది... తెలుగు తనం మూర్తీభవించి నడచి వచ్చినట్లుంటుంది. ★

అవుటర్ హార్బరులో బ్రేక్ వాటర్ నిర్మాణానికి ౫౦ టన్నుల బరువుగల కాంక్రీటు దిమ్మనుచేర్చుతున్న బ్రహ్మాండమైన క్రేన్.

హిందూస్థాన్ డ్రైడాక్‌లో ఒక నౌక







కోరమాండల్ ఎరువుల కర్మాగారంలోని అమ్మోనియా విభాగం



కోరమాండల్ ఎరువుల కర్మాగారంలోని
యూరియా గోపురం

అవుటర్ హార్బరు బాపతు నార్త్ బ్రేక్ వాటర్ నిర్మాణం దృశ్యం



# మహాభారతము

కొంపెగంటల లక్ష్మణశాస్త్రి

## 72

ప్రపంచసృష్టి ఆ తర్వాత ప్రజాసృష్టి చేయవలెనని భగవంతుడు తలచెను. అట్లు ఆయన తలచుటతోడనే ఆయన నాభియందు సనాతనమైన కమలము ప్రకటితమయ్యెను. ఆనాభి కమలమునుండి చతుర్ముఖ బ్రహ్మ పుట్టెను. ఆ కమలమునందు కూర్చొనియున్న చతుర్ముఖునకు సమస్త జగత్తు శూన్యముగా కనపడెను. జగత్తును సృజించుటకుగాను ఆయన తన మనస్సు నుండి తనతో సమానులగు 'మరీచి' మొదలగు తొమ్మండుగురు బ్రహ్మర్షులను సృజించెను. ఆ నవ బ్రహ్మలు చరాచరాత్మకమైన యీ సర్వప్రపంచమును సృజించిరి. ఇంతయేకాక వారు యక్ష–రాక్షస–భూత–పిశాచ–నాగ– మనుష్యులను గూడ సృజించిరి. ఆ ప్రజాపతికి మూడు అవస్థలు కలవు — బ్రహ్మమూర్తియై ప్రపంచ సృష్టినిచేయును. విష్ణుమూర్తియై లోకరక్షణము చేయును. రుద్రమూర్తియై దానిని శమింపజేయును.

"సింధురాజా! అద్భుత కార్యములనుచేయు భగన్నారాయణుని చరిత్రను నీవు వేద పారంగతులైన బ్రహ్మర్షుల ముఖమునుండి విన లేదా?" అని పరమేశ్వరుడైన శంకరుడు చెప్పి తరువాతి వృత్తాంతమును గూడ నిట్లు చెప్ప దొడగెను:—

"అట్లు సమస్త ప్రపంచము జలమయమైన యేకార్ణవముకాగా అప్పుడు కనబడుచున్న ఏకాకాశము నందు భగవంతుడు పృథివిని వెదకుచు వర్షాకాల రాత్రులందు మిణుగురు పురుగువలె మిణుకు మిణుకు మనుచు సంచరించుచుండెను. భూమిని స్థిరముగా నొకచో స్థాపించుటకు అట్టి స్థానమును వెదకుచుండెను.

### వరాహావతార వర్ణనము

"జలములో మునిగియున్న భూదేవిని ఉద్ధరింప దలచెను. కాని, భూమిని తాను ఏ రూపమును ధరించి ఉద్ధరించవలెనని యోచించి, జలక్రీడకు తగిన వరాహరూపమును మనస్సులో స్మరించెను. వెంటనే భగవంతుడు వేదవాఙ్మయము నందు నిరూపితమైన వరాహ రూపమును ధరించి జలమునందు ప్రవేశించెను. ఆ విశాల పర్వతాకారమైన వరాహరూపము నూరుయోజనముల (ఆమడలు) పొడవు, పది యోజనముల వెడల్పు గలిగి కోరలు మిక్కిలి పదునై ప్రకాశించుచు నుండెను. వరాహస్వామి కంఠస్వరము మేఘగర్జనమువలె గంభీరముగాను, శరీరకాంతి వర్షామేఘకాంతివలె నల్లగా నుండెను. జలములో నుండి భూమిని ఒకకోరచేత పైకి ఉద్ధరించి దానిని స్వస్థానము నందు నిలిపెను.

### నరసింహావతారము

"ఆ తరువాత మహాబాహు బలశాలియైన విష్ణుభగవానుడు ఒక అపూర్వ శరీరమును ధరించెను. దానిలో సగము మనుష్యుని రూపము, సగము సింహరూపము ఉండెను. ఆ నరసింహస్వామి రాక్షసేంద్రుడైన హిరణ్యకశిపుని సభలో ప్రవేశించి యతనితో చేయి కలిపెను. రాక్షసులకు ఆది పురుషుడు దేవశత్రువునైన హిరణ్యకశిపుడా నరసింహరూపమును చూచి మిక్కిలి క్రోధావేశము చేత కనులు ఎఱ్ఱచేసెను. అతడొక చేతిలో శూలమును, కంఠము నందు పుష్పమాలికను ధరించియుండెను. నీలిమేఘములతో సమానమగు రూపముగల ఆ దైత్యరాజు మేఘగర్జనమువంటి ధ్వనిచేయుచు నరసింహ స్వామిపైకి దాడి చేసెను. అతనిని నరసింహస్వామి తనవాడియైన చేతి నఖములచేత చీల్చెను.

### వామనావతారము

"ఇట్లు భగవంతుడు దుష్టుడైన హిరణ్యకశిపును సంహరించి, లోకహితముకొరకు మరియొక యవతారమును ధరించెను:—అదితి గర్భమునందు కశ్యపునకు పుత్రుడుగా జన్మించెను. అదితిదేవి వేయి సంవత్సరములు గర్భధారణ చేసి కొడుకును గనెను. ఆ బాలుడు వర్షాకాలమేఘమువలె నల్లగా నుండి ప్రకాశించుచున్న కన్నులతో వామనాకారమున (పొట్టిగా) నుండెను. చేత దండమును, కమండలమునుధరించి వక్షమునందు శ్రీవత్సము (శుభ్రమైన ఒక మచ్చ) తో భూషితుడై యుండెను. జటా యజ్ఞోపవీతములను ధరించి బాలరూపముతోనున్న భగవంతుడు బృహస్పతితోకూడ దానవేంద్రుడైన బలిచక్రవర్తి యజ్ఞశాలలో ప్రవేశించెను. వామన రూపములో నున్న అతనినిచూచి బలిచక్రవర్తి సంతుష్టుడై "బ్రాహ్మణోత్తమా!

నిన్ను చూచి చాలగా ప్రీతుడనైతిని. నీకు ఏమి కావలెనో కోరుకొనుము, ఇచ్చెదను" అనియనెను. అప్పుడు వామన భగవానుడు అతనిని స్వస్తివాచనము చేసి ఆశీర్వదించి నవ్వుచు "దానవేంద్రా నాకు మూడు అడుగుల భూమిని దానముగానిమ్ము." అని అడిగినంతనే బలిచక్రవర్తి ప్రసన్నుడై దానముచేసెను. మూడడుగుల భూమిని కొలచునప్పుడు భగవంతుడు అద్భుతమగు విశ్వరూపమును ధరించి సమస్త భూమండలమును మూడడుగులతో కొలచి ఆక్రమించుకొని దానిని ఇంద్రునకిచ్చెను. సింధురాజా! నీకు వామనావతార కథ చెప్పితిని. ఆ వామన భగవంతుని నుండియే సమస్త దేవతలు ఆవిర్భవించిరి. ఈ ప్రపంచముగూడ విష్ణుభగవానుని నుండి పుట్టినందుచేత దీనికి 'వైష్ణవము' అని పేరు వచ్చెను.

## కృష్ణావతారము

"దుష్టశిక్షణము, ధర్మరక్షణము చేయుటకొరకు భగవంతుడు యదు వంశమునందు కృష్ణుడను పేరుతో మానవుడుగా నవతరించెను సింధురాజా! అతనిని 'అనాది' అనంతుడు జననరహితుడు, దివ్యస్వరూపుడు, సర్వసమర్థుడు, జగద్వందితుడు, అనియందరు స్తుతింతురు. పండితులు ఆ భగవంతుని గుణములను గానచేయుచు, అతని పవిత్ర చరిత్రను వర్ణించుచుందురు అతనినే అపరాజితుడు, శంఖ చక్ర గదాధరుడు, పీతాంబరవిభూషితుడు' శ్రీవత్సలాంఛనుడునైన భగవంతుడు-శ్రీకృష్ణుడు, అను పేరుతో మానవులు స్తుతించుచుందురు శస్త్రాస్త్రవిద్యావిశారదులలో శ్రేష్ఠుడైన అర్జునుడు ఈ శ్రీకృష్ణ భగవానుని చేతనే సురక్షితుడై యున్నాడు. ఆ భగవంతుడు అర్జునుని రథముపైనే కూర్చుండి అతనికి యుద్ధమునందు సహాయముచేయుచుండును. ఆ కారణము చేత అర్జునుని జయించుట దేవతలకు గూడ సాధ్యము కాదన్నచో మానవుల మాట ఏమి?

## సైంధవునకు వరప్రదానము

సింధురాజా! ఒక్క అర్జునుని తప్ప మిగిలిన నలుగురు పాండవులను, యుధిష్ఠిరుని సర్వ సైన్యమును, నీవు ఒక దినముమాత్రము జయించగలవు. ఇది నీకు నేను వరముగా నిచ్చుచున్నాను."

జనమేజయ మహారాజా! పార్వతీ పతి, భగవంతుడైన పరమేశ్వరుడు సమస్త పాపములను హరించువాడు. దయతో పశువులవంటి జీవులను సంరక్షింపును. దక్షయజ్ఞమును ధ్వస్తము చేసినవాడు, త్రిపురములను నాశమొందించినవాడు. ఆయనకు మూడు నేత్రములుగలవు. అతడే భగదేవుని నేత్రమును నష్టముచేసెను. ఉమా దేవిసర్వదా ఆయన శరీరములో సగమై అతనితో కలిసి యుండును. అట్టి భగవంతుడు సైంధవునకు అర్జునుని మహిమను వర్ణించి చెప్పి తన సమస్త ప్రమథాదిగణములతోపాటు, పార్వతీ దేవితోపాటు అక్కడనే అంతర్ధానము చెందును. మూర్ఖుడైన సైంధవుడుగూడ తన యింటికి పోయెను. పాండవులు ఆ కామ్యక వనములోనే యుండిరి." అని వైశంపాయన మహాముని చెప్పిన సైంధవుని వృత్తాంతమును విని జనమేజయ మహారాజు "మహామునీ! ద్రౌపది అపహరణము చేత మిక్కిలి క్లేశమును అనుభవించిన పాండవులు, ఆ తరువాత, ఏమి చేసిరి?" అని యడుగగా వైశంపాయనుడిట్లు తరువాత కథను ఇట్లు చెప్పదొడగెను:—

"యుధిష్ఠిరుడు మార్కండేయ మహామునితో 'మహామునీ! యజ్ఞవేదినుండి పుట్టిన యీ ద్రౌపది పాండవులకు భార్యయై యొప్పుచున్నది. కాలభగవానుడు, విధి నిర్మితమైన దైవము, సమస్త ప్రాణుల భవితవ్యత (వారికి సంభవించబోవు ఘటన), ఈ మూడును మిక్కిలి ప్రబలములు. వీటిని ఎవడుగూడ దాటజాలడు. అట్లు కాకున్నచో, ఈ మాభార్య ద్రౌపది ధర్మజ్ఞురాలు, ధర్మరక్షణమునందు ఆసక్తిగలది. ఇట్టి యీమెకు పర పురుషునిచే సహింపబడు దోషము, ఎట్లు కలిగెను? ఇది చూడగా పరిశుద్ధమైన సత్ప్రవర్తన గలవాని యెడల అసత్యమైన దొంగతనము అంటగట్టినట్లు ఉన్నది. ద్రౌపది యెప్పుడుగూడ ఏ పాపము చేసి యెరుగదు. నిందితమైన కార్యము చేసినది కాదు. సర్వదా బ్రాహ్మణులకు సేవా సత్కారములు చేయుచు ధర్మాచరణమునందు తత్పరురాలై యుండును. అటువంటి ధర్మాత్మురాలినిగూడ సైంధవుడు మూఢబుద్ధితో అపహరించెను, ఆ కారణముచేతనే అతనికి శిరోముండనము, సపరివారముగా యుద్ధములో అపజయము కలిగెను. వారినందరిని జయించి తిరిగి మేము ద్రౌపదిని తెచ్చుకొన్నాము. మేము ఎప్పుడుగూడ ఊహించని భార్యాపహరణము, బంధుజనము ద్వారా దేశభ్రంశము మాకు కలిగెను. ప్రపంచములో నావంటి మంద భాగ్యుడు మరియెవడైన నున్నాడా? అట్టి వానిని పూర్వము మీరు ఎక్కడనైనను చూచి యున్నారా? దయయుంచి తెలుపుడు" అని యడుగగా మార్కండేయ మహాముని యిట్లు రామాయణ కథ చెప్పదొడగెను —

## శ్రీరామ చరితము

"యుధిష్ఠిర మహారాజా! పూర్వము రాముడు నీ కంటె ఎక్కువ కష్టపడినాడు. అతని భార్యను బలవంతుడైన రావణుడు ఆశ్రమమునుండి హరించి జటాయువును సంహరించి తీసికొని పోయెను. రాముడు సుగ్రీవుని బలసహాయముతో సముద్రముపైన సేతువును బంధించి లంకను దహించి, రావణరాక్షసుని సంహరించి భార్యను తిరిగి తెచ్చుకొనెను". మార్కండేయుడు చెప్పిన రామ వృత్తాంతమును విని ధర్మరాజు, "భగవన్! రాముడు ఏ వంశములో పుట్టెను? ఆయన బలపరాక్రమములెట్టివి? రావణుడెవని కొడుకు? అతనికి రామునితో నెట్టివైరము ఉండెను? ఈ విషయములన్నియు నాకు సవివరముగా తెలుప వేడెదను. అనాయాసముగా మహాకార్యములను సాధించిన రాముని చరిత్రము విన గోరుచున్నాను" అని యడిగెను.
మార్కండేయుడిట్లు చెప్పదొడగెను.

## సీతారాముల జననము

"పూర్వము ఇక్ష్వాకువంశమునందు 'అజుడు' అనురాజు ఉండెను. అతని పుత్రుడు దశరథుడు. అతడు సర్వదా స్వాధ్యాయ పరుడై శుచిగానుండెను. అతనికి రామ-లక్ష్మణ-శత్రుఘ్న-భరత నామములతో నలుగురు పుత్రులు కలిగిరి. వారు మహాబలపరాక్రమవంతులు, ధర్మార్థ, జ్ఞానసంపన్నులుగా నుండిరి. దశరథుని ముగ్గురు భార్యలలో రాముని తల్లి కౌసల్య, భరతుని తల్లి కైకేయి, లక్ష్మణ—

శత్రుఘ్నులతల్లి సుమిత్ర. విదేహదేశమునకు 'జనకుడు' అనువాడు రాజుగానుండెను. అతనికి 'సీత' యని కూతురుండెను. ఆమెను బ్రహ్మదేవుడే రాముని భార్యగానగుటకు సృజించెను. సీతారాముల జన్మమునుగూర్చి నీకుచెప్పితిని. ఇక రావణాదుల జన్మమునుగూర్చి చెప్పెదను వినుము.

## రావణాదుల జననము

"రావణునకు పితామహుడు చతుర్ముఖ బ్రహ్మ. ఆయన సర్వజగత్తునకు ప్రభువు, సర్వప్రపంచ సృష్టికర్త, సర్వప్రజా పాలకుడు, మహాతపస్వి, స్వయంభువు (తల్లిదండ్రులు లేక స్వయముగా పుట్టినవాడు) సాక్షాత్ భగవంతుడు. బ్రహ్మదేవుని మనస్సు నుండి పుట్టిన ప్రియపుత్రుడు (బ్రహ్మ మానసపుత్రుడు) 'పులస్త్య' నామముతో నొప్పారెను. పులస్త్యునకు 'గో' అనుపత్నియందు 'వైశ్రవణ' (కుబేర) నామముతో పుత్రుడు కలిగెను. అతడు మహాశక్తి సంపన్నుడు. వైశ్రవణుడు తన తండ్రిని విడిచి పితామహుడగు బ్రహ్మను సేవించుచుండెను. ఆ కారణముచేత తండ్రియైన పులస్త్యునకు కోపమువచ్చి తనతన అర్థ శరీరమునే పుత్రుడు జనింపజేసెను. అతడు 'విశ్రవా' నామముతో వెలసెను. ఆ విశ్రవుడు తండ్రి మొదటి కొడుకైన వైశ్రవణునియెడల క్రోధము కలవాడై అతనికి ప్రతీకారము (బదులు అపకారము) చేయదలపెట్టుచుండెను. పితామహుడగు బ్రహ్మదేవుడు వైశ్రవణునియెడల ప్రీతి గలవాడై యతనికి, 'అమరత్వము' ధనేశత్వము, లోకపాలకత్వము' ప్రసాదించెను. ఈ విధముగా చిరంజీవిగాను, సర్వధన రాసులకు ప్రభువుగాను, లోకమునకు పాలకుడుగాను అయిన కుబేరునకు భగవంతుడైన పరమశివుని స్నేహమును, 'నలకూబరుడు' అను అతి సుందరుడైన పుత్రుని, రాక్షస సమూహముచేత విరాజిల్లుచుండు 'లంకా' నామముగల రాజధానిని, కామగమనము (ఇష్టము వచ్చినట్లు పోవు)గల 'పుష్పక' విమానమును, యక్షులపైన ఆధిపత్యమును, 'రాజరాజు' అనుపదవిని పితామహుడైన బ్రహ్మదేవుడు ప్రసాదించెను.

"యుధిష్ఠిరా! పులస్త్యుని అర్థశరీరముగా పుట్టిన విశ్రవసుడు మిక్కిలి కోపముతో వైశ్రవణుని (కుబేరుని) చూచుచుండెను. అప్పుడు రాక్షసరాజైన వైశ్రవణుడు తండ్రియగు పులస్త్యుని కోపమును పోగొట్టి ఆతనిని ప్రసన్నునిజేయుటకు సర్వదా యత్నించుచుండెను.

"రాజరాజైన కుబేరుడు లంకలోనే నివసించుచుండెను. మనుష్యులు మోయుపల్లకి మొదలైన వాహనములయందు అతడు సంచరించుచుండెను. కనుక అతడు 'నరవాహనుడు' అని పిలువబడుచుండెను. అతడు తనతండ్రి సేవకొరకు ముగ్గురు రాక్షస కన్యలను పరిచారికలుగా నియమించెను. ఆ రాక్షసకన్యకలు నృత్యగీతములందు నిపుణురాండ్రై యుండిరి. వారు సర్వదా పులస్త్య మహామునిని సంతోషపరచుటకు యత్నించుచుండిరి. ఆ ముగ్గురు 'పుష్పోత్కటా-రాకా-మాలినీ' నామములు గలవారై యుండిరి. ఆ ముగ్గురుగూడ తన తన శ్రేయస్సును కోరువారై యుండుటచేత ఒండొరులు స్పర్థచేత పులస్త్య మహామునికి సేవచేయుచు నతనిని తమకు ప్రసన్నుని చేసికొనవలెనని పోటీపడుచుండిరి.

"పులస్త్యమహాముని ఆ ముగ్గురి సేవకు ప్రసన్నుడై ఒక్కొక్కరికి వారివారి యిచ్ఛానుసారముగా లోకపాలురతో సమానమైన పరాక్రమముగల పుత్రులు గలుగునట్లుగా వరము అనుగ్రహించెను. పుష్పోత్కటకు 'రావణ-కుంభకర్ణ' నామములతో నిరువురు పుత్రులు కలిగిరి. వారు రాక్షసాధిపతులైరి. భూమండలమునందు వారితో సమానులైన బలపరాక్రమశాలురు లేకుండిరి. మాలినికి 'విభీషణ' నామముగల ఒక్కపుత్రుడు జనించెను. 'రాకా' యను నామెకు ఒక్కపుత్రుడు, ఒక్క పుత్రిక పుట్టిరి. పుత్రుని పేరు 'ఖరుడు', పుత్రిక పేరు 'శూర్పణఖ' అని యుండెను.

"విభీషణుడు అందరికన్న నెక్కువ అందగాడు. అతడు సౌభాగ్యశాలిగాను, ధర్మరక్షకుడుగాను కర్తవ్యపరాయణుడుగాను నుండెను. విశ్రవుని పెద్ద కొడుకగు రావణునకు పది శిరస్సులు ఉండెను. అతడే రాక్షసులకు ప్రభువుగా నుండెను. అతడు బలపరాక్రమములలోను, ఉత్సాహములోను సోదరులకన్న మించియుండెను. కుంభకర్ణుడు శరీర బలములో అందరికన్న మిన్నగా నుండెను. యుద్ధమునందుగూడ నతడు అందరికన్న ఉద్ధతుడు. మాయావియు, యుద్ధకుశలుడునగు కుంభకర్ణుడు అతి భయంకరుడుగా గూడ నుండెను. ఖరుడు ధనుర్విద్యయందు కుశలుడు. బ్రాహ్మణులయెడల ద్వేషము గలవాడై మాంసాహారిగా నుండెను. శూర్పణఖ యొక్క ఆకారము అతి భయంకరము. ఆమె సిద్ధులు-మునుల యొక్క తపస్సును భగ్నము చేయుచుండెను. ఆ బాలకులందరు వేద విద్యయందు పండితులు. శూరులు, వీరులు, బ్రహ్మచర్య వ్రతమునందు నిష్ఠ గలవారై తమతండ్రియగు విశ్రవునితో పాటు గంధమాదన పర్వతమునందు సుఖముగా నివసించు చుండిరి.

"ఒకనాడు వారందరు తమ తండ్రితో పాటు కూర్చొని యున్న కుబేరుని చూచిరి. ఆ వైశ్రవణుడు మహైశ్వర్యముతో విరాజిల్లు చుండెను. అట్లున్న నరవాహనుని చూచి యాబాలకుల మనస్సులో అసూయద్వేషములు కలిగెను. అందుచేత వారు ఘోర తపస్సుచేసి బ్రహ్మను సంతోష పరచిరి.

## రావణాదుల తపస్సు

"రావణుడు పంచాగ్ని (నాలుగు వైపుల నాలుగు అగ్నులు తలపైన మీదుగా సూర్యుడు--ఇవి పంచాగ్నులు) మధ్యమునందు ఒంటికాలిపైన నిలిచి వాయు భక్షణము చేయుచు ఘోరముగా తపస్సు చేసెను. కుంభకర్ణుడు గూడా నియతమైన ఆహారమును తినుచు భూమిపైన శయనించుచు, అతి కఠినములగు నియమములతో తపస్సు చేయుచుండెను. విభీషణుడు ఉపవాసము చేయుట యందు శ్రద్ధగలవాడై ఒక్కయెండు టాకును మాత్రము తినుచు, బుద్ధిమంతుడై, ఉదారుడై, సర్వదా జపమునందే ఆసక్తి గలవాడై తపస్సు చేయుచుండెను. ఈ ముగ్గురును వేయి సంవత్సరములు తపస్సు చేసిరి. వారిని సేవించుచు, రక్షించుచు ఖరుడు, శూర్పణఖ తమ సోదరులకు తపోభంగము కలుగకుండ సర్వదా కనిపెట్టు చుండిరి.

(సశేషం)

# రంగాపూర్ ఖగోళ పరిశోధన శాల

శ్రీ ఎ. పండరినాథ్



ప్రతి పదిహేనేళ్ళలో మహాశక్తి వంతమైన కెమేరాలతో అతి సూక్ష్మాంశాలను కూడా గ్రహించే పరికరాలతో కూడిన అంతరీక్ష పరిశోధనల వలన సౌర కుటుంబంలోని సర్వ గ్రహాలను అతి సున్నితంగా పరిశీలించే అవకాశం మానవాళికి కలుగుతుందని ఇటీవలే శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడారు. దీనికి సంబంధించిన కృషి అంతటా జరుగుతూ ఉన్నది. మనదేశంలో ఇలాంటి కృషి గణనీయంగా కొనసాగుతున్నది. ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యంగా హైదరాబాదుకు సుమారు 30 మైళ్ళ దూరంలో నున్న రంగాపూర్ ఖగోళ పరిశోధనా శాలలో జరుగుతున్న కృషి చెప్పుకోవచ్చును.

అసలు పదహారవ శతాబ్దంలోనే గెలీలియో టెలిస్కోప్ ద్వారా నక్షత్రాలను చూశాడు. అది మొదలు ప్రపంచమంతటా టెలిస్కోప్ ద్వారా నక్షత్రాలను చూసే కృషి, వాటి ఫోటోలను తీసే కృషి శరవేగంతో సాగుతున్నది. శాస్త్రజ్ఞుల నిర్విరామ కృషి ఫలితంగా సౌరకుటుంబంలోని ఎన్నో గ్రహాలు నక్షత్రాలు వెలుగులోకి వస్తున్నాయి.

బృహస్పతి గ్రహం సౌరకుటుంబంలోని గ్రహాల్లోకెల్లా పెద్దది. ఇది భూమి సైజుకు 1318 రెట్లు పెద్దది. దీని చుట్టూ తిరిగే ఉపగ్రహాలు 12 వున్నాయి. ఇంతవరకు మానవునికి అంతుపట్టని "రెడ్ స్పాట్" ఉన్నది.

ఇంకా ఓరియన్ నక్షత్ర రాశిలో మండుతున్న ఇవి వై రెండు కొత్త నక్షత్రాలను జార్జియాలోని అబస్తుమన్ ఇలాడ్జె కనుగొన్నట్లు సోవియట్ వార్తా సంస్థ టాస్ ఇటీవలే ప్రకటించింది. ధగ ధ్ధగాయమానమైన ఇలాంటి గ్రహమండలాలు ఇప్పటికి 250 వరకు నమోదు అయ్యాయి. ఓరియన్ ప్రాంతములో ఈ విధమైన నక్షత్రాలు కనీసం రెండువేల వరకువుంటాయని శాస్త్రవేత్తలు విశ్వాసిస్తున్నారు.

రంగాపూర్ లోని నక్షత్ర వేధశాల 1966లో నిర్మించబడింది. దీని నిర్మాణానికి 40 లక్షల వ్యయం అయింది. దీనిని భారత ప్రభుత్వం, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ మరియు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం భరించాయి. దీనిని హైదరాబాద్ పరిసరాలకు దూరంగా రంగాపూర్‌లో ఎత్తైన కొండపైన నిర్మించారు. ఈ కొండ ఎత్తు నక్షత్ర శాల నిర్మించిన చోట సముద్రమట్టానికి 550 అడుగులుంటుంది. కొండపైన ఒక సువిశాలమైన ప్రదేశంలో దీనిని నిర్మింప జేశారు.

ఈ అబ్జర్వేటరీలో అతి ఆధునిక దూరదర్శిని యంత్రాన్ని నెలకొల్పారు. ఈ దూరదర్శిని ఇతర గ్రహాలను కూడా ఫోటో తీయగలదు. ఈ ఖగోళ వేధశాల ఆగ్నేయాసియాలో కెల్ల పెద్దదిగాను, ప్రపంచములోని ఖగోళ వేధశాలల్లోకెల్ల మూడవదిగాను పరిగణింప బడుతుంది. దీనికి అమెరికాలోని ఫోకర్ కంపెనీ తయారు చేసిన 48 అంగుళాల రిఫ్లెక్టర్ టెలిస్కోప్ (ప్రతి ఫలక దూరదర్శిని యంత్రం) ను అమర్చారు. ఈ దూరదర్శిని యంత్రం ఖరీదు 2,30,000 డాలర్లు. లేదా 17,25,006 రూపాయిలు. ఈ టెలిస్కోప్‌ను అమెరికా ప్రభుత్వం మనదేశానికి గోధుమ ఋణ, విద్యా వినిమయ కార్య క్రమ నిధుల క్రింద ఇచ్చింది, ఈ భవన నిర్మాణానికి, గెస్ట్ హౌస్ నిర్మాణానికి యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ 4,60,000రూపాయిలు ఖర్చు చేసింది.

(తరువాయి 37వ పేజీలో)

ఇప్పుడున్న ముఖమంటపం ఆమె కాలంలోనే కట్టారంటారు. తర్వాత వచ్చిన నాయనివంశస్థులు మరికొంత నిర్మాణానికి పూనుకున్నారు అంటారుగాని దానికి నిదర్శనాలు ఏమీ కనిపడవు. అనేక మంది కూర్చోటానికి తగినంత విశాలంగా కట్టిన ముఖమంటపముతో, గుట్ట క్రిందా, మీదా కోనేరులతో, చుట్టుప్రక్కల చింతచెట్ల తోపుతో అలరారుతూ వుంటుంది ఆలయప్రాంగణం. అలనాటి గురుకులానికి దీటైన రీతిలో ఆలయానికి దిగువున రాతితో నిర్మించిన గదులలో జిల్లాపరిషత్తువారి ఉన్నత పాఠశాల నడపబడుతూంది.

ఈ పదిరోజుల కళ్యాణోత్సవాన్ని పురస్కరించుకుని, చుట్టుపక్కల గ్రామాలలోవున్న యువజన సంఘాలు వైజ్ఞానిక, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేస్తారు. అందులో ముఖ్యమైనది గ్రామవెలుగు నాట్యమండలి. స్వామివారి కళ్యాణోత్సవం, నాట్యమండలివారి సాంస్కృతిక కార్యక్రమం తిలకించటానికి చుట్టుపట్ల వున్న ఊళ్ళ నుండి జనం వెండెడ్ల బళ్ళు కట్టుకుని వస్తారు. ఈ ప్రదర్శనలను రోజుకు పదివేల మంది వరకూ చూస్తారని ఒక అంచనా. వీరి సౌకర్యార్థం ఈ పది రోజులూ వివిధ రకాలయిన దుకాణాలతో నిండిపోతుందా ప్రాంతం.

నిజంగా రేపాల తిరణాలు ఆంధ్రప్రదేశ్‌లో అతి ముఖ్యమైన వాటిలో ఒకటి.

---

రంగాపూర్.........

(35వ పేజీ నుండి)

దీని మీదనున్న డూం బరువు 70 టన్నులుంటుంది. ఇది రెండు బాల్ బేరింగ్‌లమీద తిరుగుతూవుంటుంది. ఈగోళాకారాన్ని ఎటు కావలసివస్తే అటు త్రిప్పుకొనవచ్చును. నక్షత్రాల దిక్కును బట్టి ఈ డూంను నిలుపుకొని దీనికి ప్రత్యేకంగా నిర్మించబడ్డ విండోనుండి టెలిస్కోప్ ద్వారా నక్షత్రాలను చూడవచ్చును. దీని లోనే ఫోటోలను తీసే కెమెరా, డార్క్ రూంలు అమర్చబడ్డాయి.

ఈదూరదర్శిని సహాయంతో చంద్రుని, తదితర గ్రహాలను గురించి ఉస్మానియా విశ్వ విద్యాలయం వారు అనేక కొత్త ప్రయోగాలను చేయబోతున్నారు. గ్రహాలకు, నక్షత్రాలకు సంబంధించిన పరిశోధనలు జరపడానికి ఈ ప్రదేశం ఎంతో అనుకూలమైనది. ప్రపంచంలోనున్న అనేక ఖగోళశాస్త్రి వేధశాలలకు కూడా ఇది తోడ్పడి కొన్ని లోపాలను తీరుస్తుందని శాస్త్రిజ్ఞులు అభిప్రాయాన్ని వెల్లడించారు.

టెలిస్కోప్ ద్వారా శుక్రుడు, శని, బృహస్పతి, గురుడు మొదలైన నక్షత్రాలకు కుజుడు, అంగారకుడు మొదలైన గ్రహాలకు సంబంధించిన పరిశోధన కొనసాగుతున్నది. ఈ టెలిస్కోప్ ద్వారా 11000 కాంతి సంవత్సరాలదూరాన్ని చూడవచ్చును. (1 కాంతి సంవత్సరందూరం1 లక్ష 86వేలమైళ్లదూరానికి సమానమవుతుంది).

ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి నిర్వహణలో ఏర్పాటుచేయ బడిన ఖగోళవేధశాల. ఈ అబ్జర్వేటరీ డైరెక్టరే ఉస్మానియాలో ఖగోళశాస్త్రిశాఖ ఆచార్యులుగా పనిచేస్తున్నారు.

అసలు పదిహేను సంవత్సరాల క్రితమే మనదేశంలో ఒక ఖగోళ వేధశాలను నిర్మించడానికి అనువైన స్థలంకోసం శాస్త్రిజ్ఞులు అన్వేషణ సాగించారు. వారు ఆంధ్రప్రదేశ్‌లోనికొన్ని ఇతరప్రాంతాలను కూడ సందర్శించారు. చివరికి ఈ కొండను అనువైన ప్రాంతంగా నిర్ణయించారు.

రాజధానీనగరానికి అతి దగ్గరలో ఉండి ఆగ్నేయాసియాలో అతి పెద్దదైన ఈ నక్షత్రవేధశాల ప్రతి ఒక్కరూ దర్శించదగ్గది. గొప్ప ఆధునిక వైజ్ఞానిక క్షేత్రంగా విరాజిల్లిన ఈ వేధశాల మనరాష్ట్రంలో నెలకొల్పబడడం ఆంధ్రులకు అద్వితీయమైన శారప్రసాదమే అనక తప్పదు.

రంగాపూర్ హైదరాబాద్ జిల్లా ఇబ్రహీంపట్నం తాలూకాకు చెందినగ్రామం. ఇదొక చిన్నగ్రామం. దీని మూలంగానే ఈ గ్రామానికి కొన్ని ప్రత్యేక వసతులు కల్పించబడ్డాయి. ఆర్.టి.సి. వారు హైదరాబాదు నుండి ఇక్కడికి ప్రత్యేకమైన బస్సులను నడుపుతున్నారు. హైదరాబాదు నుండి నాగార్జున సాగర్ వెళ్లే దారిలో గునగల్ అనే ఊరి నుండి ఇచటికి చేరవచ్చును. ★

# స్వాతంత్ర్య సమర యోధుడు

# శ్రీ బి. రామశాస్త్రి



భారత స్వాతంత్ర్య సమరంలో జాతిదాస్య విముక్తికై నిర్విరామంగా కృషి చేసిన ఆంధ్ర ప్రముఖులలో శ్రీ బి. రామశాస్త్రి గారు ఒకరు. 1909 ఆగస్టు 10 వ తేదీన చిత్తూరు జిల్లా పుంగనూరులో వీరు జన్మించారు. వీరి కాలేజీ విద్యాభ్యాసం బెంగుళూరులోను, మదనపల్లిలోను జరిగింది. గాంధీ గారి ప్రభావం వల రామశాస్త్రిగారు హరిజనోద్యమంలో చేరి ఆటు తర్వాత స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. ఈ సందర్భంగా వీరు కొన్ని సంవత్సరాలపాటు కారాగారవాసం కూడా అనుభవింప వలసి వచ్చింది. గత ఆరు సంవత్సరాలుగా "స్వాతంత్ర్య భారత్" అనే తెలుగు వార పత్రికను నడుపుతూ ప్రజాస్వామ్య సోషలిజమ్ ఆశయ సాధనకై శక్తి వంచన లేకుండా కృషిచేస్తున్నారు.

వీరి రచనలు—"జాతీయ గీతములు, దేశభక్తి గేయములు" అనే సంకలన పుస్తకం, "రాయలసీమ ఆర్థికాభివృద్ధి" అనే చిన్న పుస్తక మొకటి తెలుగులో ప్రచురింపబడాయి. "రాయలసీమ జిల్లాల ఆర్థికాభివృద్ధి" అనే అంశంపై వీరు వ్రాసిన వ్యాసాలు ఆంధ్రప్రభ (తెలుగు దిన పత్రిక), ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (ఆంగ్ల దిన పత్రిక) లలో వెలువడ్డాయి. ఇవిగాక ప్రజా సమస్యపై వీరు వ్రాసిన పెక్కు లేఖలు, వ్యాసాలు కూడా పత్రికలలో ప్రచురింపబడ్డాయి. వీరు వ్రాసిన "పొలిటికల్ అండ్ ఎకనామిక్ హిస్టరీ ఆఫ్ కడప డిస్ట్రిక్ట్" ఇంకా అచ్చు పడలేదు.

స్వాతంత్ర్య పోరాటంలో వీరు చేసిన త్యాగాన్ని గుర్తించి భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా కేంద్ర ప్రభుత్వం వీరికి తామ్ర పత్రాన్ని బహూకరించింది.

రామశాస్త్రిగారు హైస్కూల్లో చదివే రోజుల్లోనే వీరి అన్నగారు గాంధీగారి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడంతో పిన్నవయస్సులోనే వీరిలో కూడా జాతీయ భావాలు, దేశభక్తి మొలకెత్తాయి. క్రమంగా గాంధీగారి "యంగ్ ఇండియా" "హరిజన్" వార పత్రికలను చదువుతూండేవారు. 1933 లో గాంధీ మహాత్ముడు ఎర్రవాడ జైలులో నిర్బంధించబడి హరిజనోద్యమం ప్రారంభించడం, ఆయన నిరసన వ్రతం తన్మూలాన దేశంలో బయలు దేరిన సంక్షోభం యొక్క ప్రభావం రామశాస్త్రి గారిపై బాగా పనిచేశాయి. హరిజనోద్యమంతో ప్రవేశించడంతో వీరి రాజకీయ జీవితం ప్రారంభమయింది. జమ్మలమడుగులో తాలూకా హరిజన సేవాసంఘాన్ని స్థాపించి దానికి కార్యదర్శిగా హరిజన సేవా కార్యక్రమం ఉత్సాహంగా జరిపించేవారు. 1934లో హరిజన బాలురకు ఒక రాత్రి పాఠశాలను స్థాపించి దానిలో ఉపాధ్యాయుడుగా పనిచేశారు. 1937నుంచి1945వరకు రాష్ట్రకాంగ్రెసు సభ్యుడుగా ఉండేవారు. హరిజన సేవాకార్య క్రమాలతో పాటు యువజన సంఘానొకదాన్ని స్థాపించి ప్రముఖులచే అనేక విషయాలపై ఉపన్యాసాలిప్పిస్తూ ఉండేవారు.

రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభ మయిన తరువాత ప్రతి జిల్లాలోను అధికారులు 'యుద్ధానికి' ప్రజలనుంచి నిర్బంధంగా చందాలు వసూలు చేస్తూ ఉండేవారు. ఈ నిర్బంధ చందా వసూళ్ళను ప్రతిఘటించేందుకు రామశాస్త్రిగారు సభలు జరిపి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల యుద్ధంలో భారతీయులకు సంబంధంలేదని, అందు చేత యుద్ధనిధికి విరాళాలు ఇవ్వకూడదని ఉపన్యాసాలు ఇచ్చేవారు. దానితో ఆ జిల్లా మెజిస్ట్రేటు తన్ను కలుసుకోవలసిందిగా రామశాస్త్రిగారికి కబురంపి యుద్ధనిధి వ్యతిరేక ప్రచారం మానుకోవలసినదిగా కోరడం, అందుకు శాస్త్రిగారు అంగీకరించక పోవడంతో

భారత రక్షణ చట్టం క్రింద వీరిని అరెస్టుచేసి 18 మాసాల కఠిన శిక్ష, 50 రూపాయలు జరిమానా విధించడం జరిగింది. అప్పటిలో వీరికి విధించ బడినంత ఎక్కువ శిక్ష మొత్తం రాయలసీమలోనే ఇంకెవరికీ విధింప బడలేదు. వీరి శిక్షను గురించి పత్రికల ద్వారా తెలుసుకున్న వీరి తండ్రిగారు విపరీతంగా కలత చెంది ప్రభుత్వానికి క్షమాపణ చెప్పుకొని విడుదల పొందవలసిందిగా కబురంపారు. కాని రామశాస్త్రిగారు అందుకు అంగీకరించలేదు.

మొదట కొంత కాలం పాటు వీరిని వేలూరు జైలులో 'సి' క్లాసు ఖైదీగా ఉంచారు. అక్కడ వీరు శ్రీ రంగా గారిని కలుసుకొనడం జరిగింది. ఖైదులో భోజనం అన్నము ముద్ద, పులుసు, కొంత నీళ్ళమజ్జిగ ఇస్తూఉండేవారు. ఉదయం గంజి ఇచ్చేవారు. డ్రస్సు నిక్కరు, బనీను, టోపీ సాయంత్రం 5 గంటలకే రెండవ పూట భోజనం చేసేవారు. 6 గంటలకు 'సెల్'లో వేసి బీగం బిగించేవారు. సెల్‌లో మూత్ర విసర్జనకు ఒక మట్టి ముంత, మల విసర్జనకు మరొక ముంత ఉండేవి. వేలూరు జైలులో క్రమేణా రాజకీయ ఖైదీల సంఖ్య పెరిగి పోవడంతో మధ్యలో కొంతకాలం పాటు శాస్త్రిగారిని కోయంబత్తూరు జైలుకు మార్చారు. తిరిగి వేలూరుకు, అటుతరువాత తిరుచునాపల్లి క్యాంపు జైలుకు మార్చడం జరిగింది.

తిరుచునాపల్లి జైలులో తమిళనాడు, కేరళ రాష్ట్రాలకు చెందిన నాయకులు, కార్యకర్తలు, శాసన సభ్యులు, ఎం. పి. లు. సుమారు 400 మంది రాజకీయఖైదీలు ఉండేవారు. అక్కడనే శాస్త్రిగారికి శ్రీయుతులు ప్రకాశం పంతులు, రాజగోపాలాచారి, వి. వి. గిరి, సత్యమూర్తి, నీలం సంజీవరెడ్డి, గొట్టిపాటి బ్రహ్మయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, మొసలికంటి తిరుమలరావు, తెన్నేటి విశ్వనాథం, వెన్నెలకంటి రాఘవయ్య కొండాలి ఆంజనేయులు, క్రొవ్విడి లింగరాజు, మలబారు కేళప్పన్, మొదలైన ప్రముఖ దక్షిణాది నాయకులతో పరిచయం ఏర్పడింది. జైలులో అప్పుడప్పుడు సభలు, సమావేశాలు, వార్తాపత్రికలు చదివి నోట్సు వ్రాసుకునేవారు. సాయంత్రం జైలు ఆవరణలో నేతిరిగేవారు.

క్రమేణా అందరూ విడుదలైనా శాస్త్రిగారి శిక్ష ఎక్కువ కావడం చేత ఆయన విడుదల కాలేదు. తిరుచునాపల్లి క్యాంపు జైలు ఖాళీకాగా వీరిని బళ్లారి వద్దనున్న అలీపురం జైలుకు మార్చారు. అలీపురం జైలులో రెండు మాసాలున్న తరువాత విడుదలయ్యారు. వీరిపై విధింపబడిన 50 రూపాయల జరిమానాను వీరు కట్టలేదు. అందుచేత మరొక రెండు మాసముల శిక్ష విధింపబడింది కాని వీరి స్నేహితులొకరు ఆమొత్తాన్ని చెల్లించడంతో వీరు విడుదల పొందారు.

కాంగ్రెసు కార్యకర్తలకు శిక్షణ నిచ్చేందుకు గాను వీరు 1946 మార్చిలో ఒక రాజకీయ పాఠశాలను జమ్మలమడుగు తాలూకాలో 15 రోజులు నిర్వహించారు.

ప్రజలలో శాస్త్రిగారు సంపాదించిన పలుకుబడిని పురస్కరించుకొని 1946 సెప్టెంబరులో ప్రకాశం మంత్రివర్గం ప్రారంభించిన ఫిర్కా డెవలప్‌మెంట్ స్కీము నందు ఆఫీసరుగా పని చెయ్యవలెనని ఆహ్వానం వచ్చింది. ఈ ఉద్యోగంలో రామశాస్త్రిగారు ఐదు సంవత్సరాల కాలం (1946-1951) పనిచేశారు.

స్వాతంత్ర్య పోరాట కాలంలో, దేశానికి 1947 లో స్వరాజ్యం సిద్ధిస్తుందని నమ్మకంతో కాక కేవలం దేశసేవ చేయాలనే ఉత్సుకతతోనే గాంధీ గారి పరిశీలనకిలోనై శాస్త్రిగారు స్వాతంత్ర్యోద్యమంలో దుమికేరు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత కూడా ఆయనలో దేశసేవా తత్పరత తగ్గలేదు. సోషలిజం సాధనకై తన పత్రిక ద్వారా నిరంతరం కృషిచేస్తూనే ఉన్నారు. భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ గారి అభ్యుదయకర విధానాలను ఆంధ్రులు గుర్తించి ఆమెతో సహకరించగలరని, తమతోటి స్వాతంత్ర్య యోధుల సహకారాన్ని స్వీకరించి, తమలోని విభేదాలను విస్మరించి రాష్ట్ర పురోభివృద్ధికి పాటు పడ గలరని వీరి ఆశ.

(ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో సౌజన్యంతో)

---

## విజ్ఞప్తి

ఆంధ్రప్రదేశ్ పత్రిక గ్రామీణ ప్రాంతాల ప్రజల దగ్గరకు వెళ్లే పత్రిక. అందుచే సాధ్యమైనంత వరకు రచనలు సరళమైన వ్యావహారిక భాషలో వుంటే బాగుంటుంది. రచయితలు గమనింప ప్రార్థన.

ప్ర. సం.

సీరియల్ :




నగరోద్యానవనంలో పండరంగునితో సహా తన ఊహాలని కలబోసుకుంటూ విజయాదిత్యుడు విహరిస్తున్నాడు. తోటలో శ్రావ్యమైన పక్షుల కూతలు విన్పిస్తున్నాయి. సువాసనలు నింపుకొని చిరుగాలులు సనసన్నంగా వీస్తూ మనస్సుకి ఆహ్లాదాన్ని కల్గిస్తున్నాయి. ఈ సుందర ప్రకృతి విజయాదిత్యుని ఏ మాత్రం ఆకర్షిస్తున్నట్టు లేదు. ఉన్నట్టుండి పండరంగుని వైపు తిరిగి చూశావా పండరంగా, మల్లప్ప అమ్మగారితో మనపై చాడీలు విన్నవించాడు. అమ్మగారేం నొచ్చుకున్నారోనని భయంగా ఉంది.

"చెప్పనీ సఖా, భయందేనికి ? ఆత్మగౌరవం నేరంకాదే ? అన్నాడు ధీమాగా పండరంగుడు."

"అమ్మగారు ఎంత నొచ్చుకున్నారో, వినయడి శర్మగారిచేత మనకు హితోపదేశం చేయిస్తారట."

"అందుకనా మననే తోటలో కలుసుకోమని శర్మగాడు మన ఇర్వురికీ కబురు పెట్టారు ?" ఎదురు ప్రశ్నవేసి విషయం గ్రహించినట్టు అన్నాడు పండరంగుడు.

దూరంలో కడియ రాజుగారు. వినయడి శర్మగారు రావడం విజయాదిత్యుని కంటపడి, పండరంగునికి చూపుతూ "అదిగో వస్తున్నారు చూడు, మీ తండ్రిగారుకూడా వస్తున్నారు" అంటూ అటు వైపు దారి తీశాడు విజయా దిత్యుడు. విజయా దిత్యునీ, పండరంగునీ చూసిన కడియ రాజు "చిరంజీవులు ముందుగానే వచ్చారే" అని పల్కరించారు. 'అమాత్యుల వారికి నమస్కారం' అని విజయాదిత్యుడు వినయడిశర్మగారికి ప్రణామం చేశాడు 'మనోరథ సిద్ధిరస్తు' అంటూ వారు దీవించారు. 'దండనాధులకు అభివందనాలు' అని కడియ రాజుకు ప్రణయిల్లాడు విజయా దిత్యుడు.

"విజయీభవ, నాయనా పండరంగా నీవూ రాచకొమారులం వారూ రాష్ట్రికూటులపై ద్వేష భావంతో ఉన్నారట. నిజమేనా" అని సూటిగా కుమారుణ్ణి ప్రశ్నించారు.

"నాన్నగారూ దానికి కారణం లేకపోలేదు. ఈ రాజవంశాన్ని అవమానపరిచే శాసనాలు ఆ చక్రవర్తి వేయించాడట."

"విన్నాం. నాయనా, విజయా, ఆ వార్త విన్నాక మా రక్తం ఉడికిపోయింది" అని వినయడి శర్మగారు బదులు చెప్పారు.

'అం అమాత్యులవారుకూడా మాలాగే బాధపడుతున్నారన్నమాట'.

" అవునవును. ఎవరి ఉప్పు తింటున్నామో వారిని ఇతరులు నిందిస్తే ఊరుకోగలమా? ఆ వాహ్యాళి పెకలించి తీరాలి" ఆవేశంగా అన్నారు వినయడి శర్మగారు. 'అందుకనే ప్రతీకార దీక్ష పూనాము' అని బదులు చెప్పాడు పండరంగుడు.

'అది శ్లాఘనీయమే పండరంగా, కడుంగడు శ్లాఘనీయం. అవసరం వచ్చినప్పుడు పగతీర్చుకొందాములే. ఈలోగా మనము చేయవలసినవెన్నో ఉన్నవయ్యా.

"ఏమిటవి ?" కుతూహలంగా ప్రశ్నించాడు విజయాదిత్యుడు.

"మాన్యఖేటకంలో చక్రవర్తితో నీవు మాట్లాడినావా విజయా ?

“పెక్కు మాటలు”

ఒనోటి పద్యస్యాడు గుడు చదివారా ఏదా ?

“అప్పుడప్పుడు వారి పద్యాలు వారే చదివితే విని ఉన్నాము.

“చక్రవర్తి కన్నడభాష నెంత ప్రేమ తోనో చూసుకున్నంతగా ద్వేషిస్తారట. నిజమేనా ?” అడిగారు అమాత్యులు.

“లేదు. మాయయ్యగారు కన్నడ చక్రవర్తి తెలుగుదేశ అంద పండితుని మెచ్చుకున్నారే!” అనుమానంగా బదులు చెప్పాడు విజయాదిత్యుడు.

పెదవి విరుస్తూ ‘లేదు నాయనా’ అని ముఖస్తుతి మాటలు. అంతరాంతరాలలో వారికి తెలుగుమీద ద్వేషంభావమే ఉంది. మన తెలుగు భాషకి ఒక వ్యాకరణముగాని ఛందస్సుగాని లేదని ఎత్తి పొడుస్తారు.

‘వారి కన్నడానికి మాత్రం ఉన్నదా ఏమిటి ?’ కోపంగా అన్నాడు పండరంగుడు,

‘అందుకే కదా చక్రవర్తి కవిరాజ మార్గమనే ఛందో గ్రంథాన్ని రచించాడు.’ అని బదులు చెప్పారు కడియరాజు కొడుక్కి.

“మన తెలుగులో అటువంటి గ్రంథం ఎప్పుడైనా రచించ కూడదా?’ అడిగాడు పండరంగుడు.

‘ఎవరున్నారు ? నిత్య కర్మానుష్ఠానపరులు వేదపారీణులు అయిన వారందరికి ఈ తెలుగు భాష గానట దీనట. వారికి దేవ భాషపైనేగాని తెలుగుపైన మక్కువ లేదు’ అని నిట్టూర్చారు కడియరాజు.

‘మన తెలుగుభాష దేవతల భాషకన్న తియ్యగా ఉంటుంది. కాదని దైవముకూడా అనలేదు నాన్నగారూ’ అన్నాడు ఉద్రేకంగా. ఆప్యాయంగా కొడుకు భుజం తట్టారాయన. అలా కొడుకు భుజం తడుతూనే ‘నిజమే. అయినా నీ భాషలో ఒక్క కావ్యమైనా ఉందా ? కన్నడంలో ఎన్నో ఉన్నాయి. నీ భాషలో రాజులు శాసనాలు చేస్తారా ? పండితులు ప్రశంసలువిరచిస్తారా ? ఉత్తది’ అన్నారు.

“ఆదరించేవారులేక, ఆజ్ఞాపించేవారురాక అలాగ ఉంది. గుణకా, నీవు రాజ్యానికి వచ్చాక, శాసనాలన్నీ తెలుగులోనే వేయించాలి.” అంటూ స్నేహితుడైన విజయాదిత్యుని హెచ్చరించాడు.

ఇది విన్న వినయడిశర్మగారు ‘తథాస్తు’ నాయనా విజయా, కన్నడచక్రవర్తి కవిరాజమార్గం విరచించినట్లు నువ్వు నా పేరిట ఒక తెలుగు ఛందోగ్రంథం వ్రాయాలి’ అన్నాడు.

‘అవునవును గుణకాంక ఛందస్సు అని వ్రాయవయ్యా నెచ్చెలీ’ అంటూ ఉత్సాహం ప్రదర్శించాడు పండరంగుడు.

“లక్షణగ్రంథ రచనకు కావలసిన శక్తిసామర్థ్యాలు నాకు వున్నాయా పండరంగా?’ అచ్చెరువందుతూ ప్రశ్నించాడు విజయాదిత్యుడు.

“ఏమంటే సంపాదించవయ్యా. తెలుగులో ఎన్ని దేశిఛందస్సులేవో? వాటి రహస్యాలను శోధించాలి” అని అన్నారు వినయడిశర్మగారు.

“భాష సముద్రము వంటిది కదా?” అనుమానం వెలిబుచ్చాడు విజయాదిత్యుడు.

“రత్నాకరంలో నున్న రత్నాలను సమర్థుడే బయటకు తేగలడు.” అన్నారు వినయడిశర్మగారు.

అది విన్న కడియరాజు “అవును విజయా, ద్విపదలు, తరువోజలు, అక్కరలు, మొదలైన దేశికవితలు జనులనోట కోకొల్లలుగా ఉన్నవి. వాటిని శాస్త్రాంకెక్కించటం అవసరం. అలా ఎక్కించితే ఎంతైనా పుణ్యముంటుంది.” అని ఉత్సాహపరిచారు.

“ఎన్నెన్ని పదాలు దేశీయులు వాడుకొంటున్నారు కాదు? దుమ్మెదపదాలు వెన్నెలపదాలు చందమామపదాలు గొబ్బిళ్ళు, ఏలలు ఓ... అసంఖ్యాకాలు. అవన్నీ విని వాటి రచనావిధానాలను సూత్రీకరించాలి. మన తెలుగుభాషలో కూడా ఒక ఛందస్సు ఉన్నదని చూపిస్తే రాష్ట్రీయుల గర్వం పెరుగుతుంది. ఏమంటావు? ”అడిగాడు వినయడిశర్మగారు.

‘అవును విజయా, గ్రంథరచనను ఉపక్రమించు” అంటూ స్నేహితుని పక్కగా వెళ్ళి నిలబడ్డాడు పండరంగుడు.

“మీ అందరి తోడ్పాటుంటే తప్పక రచిస్తాను” అంటూ సాదరంగా పండరంగుని భుజంపై చేయి వేశాడు విజయాదిత్యుడు.

“ఎందుకు వదు రాకుమారా? అనుశ్రుతంగా తరతరాలనుండి జనులు పాడుకొనే పాటలు ఒక గాయకుడు కమ్మగా పాడుతాడు అతని పాటలు విని వ్రాసుకోవచ్చును.”

“ఎవరా గాయకుడు అమాత్యా!” కుతూహలంగా ప్రశ్నించాడు విజయాదిత్యుడు.

‘అతగాడు అపరతుంబురుడు నాయనా, రాలు కరిగించే గాంధర్వం వానికి వెన్నతో పెట్టిన విద్య. పేరు మల్లప్ప. అతడు పాటలుపాడితే అతని కుమార్తె చెలువమ్మ అభినయిస్తుంది”

“వారిద్దరినీ నగరికి రప్పించరాదా? మిత్రుడు వింటాడు?” సూచించాడు పండరంగుడు.

వినయడిశర్మగారు నవ్వుతూ ‘రాదయ్యా, అతని వంశీకులు దేవాలయంలో సేవలవారు. స్వామివారి ముందు పాడడమే తప్ప యితరత్రా గొంతెత్తడు మల్లప్ప.

“అలాగా! అయితే నేనే వారి చెంతకు వెడతాను. పరిచయం చేయండి అమాత్యా.

‘తప్పక. మంచిదినము చూసి.....,

“మనం వెంటనే వెళ్లకూడదా?” అప్పుడే బయలుదేరడానికి సంసిద్ధత వ్యక్తపరిచాడు విజయాదిత్యుడు.

(తరువాయి 45వ పేజీలో)

# వార్తా చిత్రాలు




ముఖ్యమంత్రిని డిసెంబరు 14 న సికిందరాబాదులో ఒక కార్యక్రమంలో జంటనగరాలలోని వివిధ సంస్థలవారు సన్మానించారు.

ముఖ్యమంత్రి డిసెంబరు 20న గుంటూరు హరిజనులకు గేదెలను పంపిణీచేశారు.



వా ర్తా చి త్రా లు



శ్రీ ఎం.వి రాజగోపాల్, ఐ.ఎ.ఎస్. డిసెంబరు 6న హైదరాబాదులో జకోస్లవేకియా బాలల చలనచిత్రోత్సవాన్ని ప్రారంభించారు.

డా. ఎన్, రమేశన్. ఐ.ఏ.ఎస్, హైదరాబాదులో డిసెంబరు 6న బడ్జెట్ విధానాల పునర్విమర్శన తొలి శిక్షణ కోర్సులో ప్రసంగించారు.



# లోకయాత్ర - ప్రజలపై దాని ప్రభావము

శ్రీ ఎస్. వై. హుస్సేన్

పరమ పవిత్రమైన పరంధామ ఆశ్రమంలో ఆచార్య వినోబా అడుగుజాడలలో వారు అభ్యసించినది అనన్య సామాన్యమైన బ్రహ్మ విద్య కావచ్చు. దాని ప్రేరేపణవల్ల పంద్రెండేళ్ల పర్యటనకు వారు ఉపక్రమించవచ్చు. కాని వారు తమ ప్రబోధాలవల్ల, ప్రవచనాల వల్ల ప్రజలను ఎలా ప్రభావితులను చేయగలరనేదే అందరికి కలిగిన అనుమానం. నా వరకు నేను ఈ తపఃసంపన్నులు తమ ప్రసంగాలలో వేదాలు వల్లెవేస్తూ వేదాంతాన్ని గుప్పిస్తూ తమ ప్రజ్ఞా ప్రతిభలను ప్రదర్శిస్తూ, సామాన్య ప్రజలకు అర్థంకాని నిరుపమాన ఉపమానాలలో విసుగెత్తిస్తారని అనుకొన్నాను. అయితే వారి ప్రసంగాలలోని ప్రవచనాలు, ప్రబోధాలే కాదు వారి ప్రవర్తనవల్ల కూడా ప్రజలు ప్రభావితులైనారంటే ఆశ్చర్యపడ నవసరములేదు.

ఆచార్యుని అనుజ్ఞతో 1967లో ఇండోరు నుండి పాదయాత్ర ప్రారంభించిన ఈ లోకయాత్ర బృందం పలుప్రాంతాలు పర్యటించింది. తూర్పు గోదావరిజిల్లా సర్వోదయ మండలి ప్రకటించిన కార్యక్రమము ప్రకారం ఈ బృందం జూలై 21వ తేదీన పాతగన్నవరం చేరాలి. అంతకు ముందురోజున బసచేసియున్న అంబాజీపేట నుండి తెల్లవారుఝామున గం. 4-30 ని॥లకు బయలుదేరి గన్నవరం సమితిలోని మొదటి గ్రామము ముంగండ గం. 5-15 ని॥లకు ఈ బృందం చేరితే ముందుగా ముంగండలో సాదరంగా స్వాగతమివ్వాలని అనుకొన్నారు అందరూ. అయితే ఆ రోజు అర్ధరాత్రి ఆకాశంలో అలుముకొన్నాయి కారు మేఘాలు-మూడు గంటలకు మొదలైనవి చినుకులు, నాలుగయ్యేసరికి కుండపోతగా పడసాగింది వర్షం-కారు మేఘాల మధ్య ఉరుములు, మెరుపులు, కొండొకచోట పిడుగులు-అట్టి వాతావరణములో మానవమాత్రుడు సాహసించి కాలినడకను ప్రయాణానికి సిద్ధపడుట సాధ్యమా? ముంగండ రహదారి ప్రక్కనేగల పండిత రాయలు పఠన మందిరములో ఉన్న నేను నాసహోద్యోగి శ్రీ పప్పుల నారాయణమూర్తి, తెల్లవారుఝామున గం. 4-45 ని॥లకు ఆ వర్షంలోనే కొంతమంది గ్రామస్థులను సమీకరించాలని చేసిన ప్రయత్నం సఫలం కాలేదు, గ్రామంలోని వారు ఇండ్లనుండి బయటికి వచ్చే అవకాశమే ఇవ్వలేదు వర్షం-ఇక గన్నవరంనుండి రావాలనుకొన్నవారేమి రాగలరు! కాని గం. 5-15 ని॥లకు కన్ను మిన్నుకానని కటిక చీకటిలో ఒక మెరుపు మెరిసింది-ఆ మెరుపు వెలుగులో దివ్యమూర్తులవలె దర్శనమిచ్చారు ముఖ్యులు ముగ్గురు-వారే లోకయాత్ర నల్పుచున్న పాదయాత్రికులు - కుమారి నిర్మలవేద్, లక్ష్మీబహన్, దేవీబహన్ రిర్యూని-పండిత రాయలు పఠన మందిరములో ఉన్న మేము, ముందుకురికి వారికి స్వాగతం పలికాం. ఆ వర్షంలో నాటి వారి గమ్యస్థానమైన గన్నవరం వరకు వారి వెంట నడుచుట మాకు దుస్సాధ్యమనిపించలేదు. కాని ఈ సంఘటనను గురించి వినువారికి ఇది సాధ్యమా అని అనిపించక పోలేదు. ఇట్టి అసాధ్యాన్ని సాధించగల సమర్థత వారిలో ఉండబట్టే వారి ప్రభావము అంత ప్రస్ఫుటంగా పడ్తుంది ప్రజలపై.

ఇక వారు తమ ఉపన్యాసాలలో జ్ఞానచింతనతో చూపే గగన కుసుమాలు అందుకోలేక అవస్థ పడాలనుకొనే నాబోటి సామాన్యునకు సయితం వారి ప్రబోధాలు ఆచరించుట అంత అసాధ్యమని అనిపించలేదు. అతి సామాన్యమైన విషయాన్ని తీసుకొని అందుండే ఎంతో విలువైన విషయాన్ని, వెలికి తీసి బోధించుట వారి ప్రత్యేకత కాబోలు! మచ్చుకు కొన్ని ఇక్కడ వివరిస్తాను.

ఉపన్యాసములో విద్యార్థులను ఉద్దేశించి ఒకామె అంటుంది. "మీ గ్రామంలో వీధులు ఎవరు శుభ్రపరుస్తారు?" విద్యార్థులంటారు- "పాకీవారు" అప్పుడామె ప్రశ్నిస్తుంది, "వీధులలో చెత్తాచెదారం ఎవరు వేస్తారు?" విద్యార్థుల సమాధానం - "మేమే-ప్రజలం" అప్పుడామె తిరిగి అడుగుతుంది - "అయితే మీరు ఎవరిని గౌరవిస్తున్నారు? శుభ్రపరిచేవారినా! పాడుచేసేవారినా?" విద్యార్థులకు అనక తప్పదు "శుభ్రపరిచే వారిని గౌరవించుటలేదు"- ఈ సారి ఆమె అంటుంది, "శుభ్రపరిచేవారిని గౌరవించకపోయి-పాడు చేసేవారిని గౌరవించుట న్యాయమా! అన్యాయమా?" విద్యార్థులు ముక్తకంఠంతో అంటారు "ఇది అన్యాయం"-ఈ అన్యాయాన్ని అరికట్టిననాడే మన సమాజం బాగుపడ్తుంది అంటుందామె-ఇందులో ఎంతటి విప్లవాత్మకమైన భావమున్నది!

ఉపన్యాసములో యువకులనుద్దేశించి మరొకామె అంటుంది. తాను ఒక మెడికల్‌కాలేజీలో విద్యార్థులను కలుసుకొని ఇలా ప్రశ్నించిందట-"మానవులు ఉన్నతులా?-లేక పశువులు ఉన్నతమైనవా?"-ఆ నవ నాగరికులు సగర్వంగా సమాధానమిచ్చారు "మానవునికి పశువునకు పోలికేమి? మానవుడు అన్నివిధాలఉన్నతుడే" అప్పుడామె ఆ యువకులతో అన్నదట "పశువులు అమ్ముడుపోయి తమ యజమానులకు సేవచేస్తాయి-మరిమీరో-అమ్ముడుపోయి మీ యజమానులచేత ఊడిగం చేయించుకొంటారు-తెలిసిందా? వివరణ కావాలా?-పశువులు సంతలో అమ్ముడు పోతున్నవి. మీరు పెండ్లి మార్కెట్టులో వరకట్నం అనే మూల్యానికి అమ్ముడుపోతున్నారు-ఈనాడు మీ రేటు వేలనుండి లక్షలవరకు ఉన్నది. ఇక చెప్పండి

యజమానురాలిచే ఊడిగం చేయించుకొనే మీరు కృతజ్ఞులా! తన యజమానులకు సేవచేసే పశుజాతి ఉన్నతమైనదా?" గద్దిస్తే గొంతే నయం. మానవత్వంలేని మానవునికన్నా అంటుందామె ఆవేదనతో. ఇంత సామాన్యమైన ఉదాహరణనిచ్చి గుండెల్లో గుచ్చుకొనేటట్లు చెప్పే వారి మాటలను మరువగలమా!

పెద్దలనుద్దేశించి అడుగుతుంటుం దామె—"మీ గ్రామంలో దేవాలయాలున్నవా." సమాధానంగా సభ్యులంటారు "ఉన్నవి" ఆమె అడుగుతుంది "అందులోఉన్న దేవుని విగ్రహాన్ని ఎవరు చేశారు?" పెద్దల సమాధానం—"మనుష్యులు"—అప్పుడామెఅంటుంది "మనుష్యులు మలచిన మూర్తులను మీరు అంత భక్తితో పూజిస్తారే మరి దేవుడు మలచిన మానవులను మీరు ఎందుకంత ప్రేమతో చూడరు?" మానవుడు తోటి మానవుని ప్రేమించాలనే చెప్తూ ఆత్మలో పరమాత్ముడున్నాడనే పరమ సత్యాన్ని ఎంత సున్నితంగా చెప్పగలిగిందామె!

స్త్రీలనుద్దేశించి ఆమె అంటుంది—"ఉమ్మడి కుటుంబంలో ఒక కోడలు తోటికోడళ్ళ పిల్లలందరికి అన్నం వడ్డిస్తుంది కాని అన్నంలో తన పిల్లలకు వడ్డించినంత నెయ్యితోడి కోడళ్ళ పిల్లలకు వడ్డించదు—ఇలాయి వంచవలసి వచ్చినప్పుడు పిల్లలందరకు కొద్ది కొద్దిగా పెట్టి మిగిలింది తన గుంపులో వేసుకుపోయి—ఎవరూ చూడకుండా మిగిలినదంతా తన పిల్లలకుపెట్టి, వారు తిన్న తరువాత మూతులు తుడిచి బయటకు పంపుతుంది—అంటే పసితనం నుండి పిల్లలకు స్వార్థం నూరిపోస్తుంది. సమిష్టి కుటుంబ వాతావరణంలో పెరిగిన పిల్లలు భావి పౌరులై భావాలు ఎలావాలో అపురాలింటుంది ఆమె. స్త్రీ స్వార్థపూరిత భావాన్ని వదలి అందరి పిల్లలను సమానంగా చూస్తే తనకు వంటబట్టి ఉన్నపుడు—మాతృమూర్తి తన వాత్సల్యాన్ని విస్తృతం చేస్తే విశ్వమాత అవుతుంది. సంఘంలో ఆమె ఎంత పెరుగుతుందో గ్రామసీమలకు ఇది సోదాహరణంగా.

విశ్వసంఘ సదస్సుల చెప్పిన స్వాములు సాధారణంగా సామాన్యులకు దుర్లభంగా తమ తపశ్శక్తిని తమ ముక్తి కొరకు వినియోగిస్తారు—అథవా అప్పుడప్పుడు ఎవరైనా బయటకి వస్తే, వారు తమ వింత విద్యలతో విభ్రాంతులను చేస్తారు, వారి వల్ల వేరిస వారెన్న—కాని ఈ తపశ్శక్తిసంపన్నురాలైన బ్రహ్మచారిణులు, నవయుగ వైతాళికులు తమ శక్తి యుక్తులను వినియోగించి పవిత్ర మార్గంలో పయనిస్తున్న నేటి సమాజాన్ని సన్మార్గానికి మళ్లించాలనే ప్రయత్నంలోనే ప్రజల మధ్యకు వచ్చారని అనిపిస్తుంది. వారి ప్రయత్నం సఫలం కావాలని కోరుకుందాం 

---

## పండరంగుని ప్రతిజ్ఞ . . .

(11వ పేజీ నుండి)

వినయడిశర్మగారు నవ్వుతూ "రాచబిడ్డవు. సముచిత వస్త్ర ధారణ చేసి రావయ్యా వెళ్లవచ్చు" నన్నారు

విజయాదిత్యుడు తన ఆత్రతకు సిగ్గుపడి, 'మంచిది అమాత్యా ఒక్కలిప్తలో తిరిగివస్తాను. రా, పండరంగా నగరికి వెళ్లివద్దాం' అంటూ పెద్దలిద్దరి వద్ద సెలవు గైకొని హుటాహుటిని నగరిమార్గం పట్టాడు.

వారిటు వెళ్లనిచ్చి కడియరాజు వినయడిశర్మగారిని నిల వేశాడు. "ఏమిటి శర్మగారూ 'శీలమహాదేవమ్మగారు తమకుచెప్పిన దేమిటి? తాము చేస్తున్నదేమిటి?' అని ప్రశ్నించాడు.

'చెప్పినట్లే అక్షరాలా చేస్తున్నాను.

'రాష్ట్రకూటులపై రాచబిడ్డలు ద్వేషం ఇనుమడింప చేస్తున్నావే?' అడిగాడు కడియరాజు.

'హితోపదేశం పరోక్షంగా చెయ్యాలి కడియరాజా! రాష్ట్రకూటులు మంచివారని చెప్తే అతడు మనమాటలు చెవిని పెడతాడా?" నవ్వాడు శర్మగారు.

'అందుకని అతగాని మాటలకు మీరు తాళం వేస్తారా?"

'లేదు. మొదట తాళంవేసి, మెల్ల మెల్లగా నమ్మకం కల్గించి తరువాత మనం ఏది చెప్పినా వింటాడు. చెప్పిన దానిలో సత్య ముందని తలిస్తే ఆచరిస్తాడు.

ఏమంటారు?"

కడియరాజు ఆశ్చర్యం ప్రకటించి 'అదా మీ తంత్రం?" అన్నాడు.

"కాదు. ఇది మంత్రాంగం. కోరికి కొబ్బరి దొరికినట్టు ఈ ఛందోగ్రంథ రచనలో పడి రాష్ట్రకూటులపై ద్వేషాన్ని మరుస్తాడు. పాటల మల్లప్పతోపాటు మంచి వయసు కల మగువ కూడా ఉంది కదా?"

"ఉత్తరోత్తరా ఆ చెలువమ్మ ప్రేమలోపడి ప్రపంచాన్నే మరచిపోలే? అనుమానం ప్రకటించాడు కడియరాజు.

'ఆ సాని బంధువులు అదృష్టవంతులవుతారు అంతేకదా!" తేలికగా అనేశాడు శర్మగారు.

"రాచకార్యాలు భంగం కావా!"

ఇతడేం ఇప్పుడు ఊరేలుతున్నాడా? యువరాజా పట్టం కట్టుకున్నాడా? అవసరం వచ్చినప్పుడు మళ్లీ చక్రం అడ్డువేయనా? ... రండి మనం కూడా బయలుదేరుదాం, త్వరలోనే విజయుని మల్లప్పదగ్గిరికి తీసుకువెళ్లి పరిచయం చేస్తాను" అంటూ తన పథకం పారినందుకు లోలోన సంతోషపడుతూ ఉద్యానవనందాటాడు వినయడిశర్మగారు. వారి వెనుకనే కడియరాజు కూడా నడిచాడు

(సశేషం)

# గిరిజన సంక్షేమం

శ్రీ జి. వి. రామమూర్తి

ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 20 లక్షల మంది గిరిజనులు ఉన్నారు. గిరిజన జనాభాలో ఆంధ్రప్రదేశ్‌ది నాల్గవ స్థానమే అయినా వారి సంక్షేమ కార్యక్రమాల ప్రగతిలో ఆంధ్రప్రదేశ్‌ది ప్రథమ స్థానం.

చెంచులు, ఎరుకలు, ఏనాదులు, కొరవలు, లంబాడీలు, గదబలు, ఖోండులు, సవరలు మొదలైన కొండజాతుల వారు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నారు. వీరిలో కొందరు నాగరికులైన పల్లపు ప్రదేశాలలోని పల్లెవాసులతోను, పట్నవాసులతోను పరిచయాలు ఏర్పరచుకొన్నారు. మరికొంత మంది దేశసంచారులుగా తిరుగుతూ కూలీలుగా పని చేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోనున్న గిరిజనులందరిలోనూ చాలా వెనుకబడినవారు శ్రీకాకుళం జిల్లాలోని సవరవారు. నేటి ఈ సవరలు పురాణయుగంనాటి శబరులే. మన దేశంలోని సంతాలులు, ముండేరీలు మొదలైన ఆదిమ జాతులవారు ఈ శబరుల సంతతికి చెందినవారే. గోండులు, గదబలు మరికొన్ని కొండజాతుల వారిలో సవరలన్న పేరుగల తెగలవారు నేటికీ ఉన్నారు. నాటి శబరులు లేక నేటి సవరలు ద్రావిడులకన్నా, ఆర్యులకన్నా ముందుగా భారత దేశంలో ఉండేవారు. అందుచే వారు ఆదిమ వాసులైనారు. సంస్కృతములోగాని, ద్రావిడ భాషలలోగాని సంబంధం లేని భాష వీరిది.

వేదకాలంలో సవరలకు ఆర్యులతో పరిచయముండినా ఆర్యుల నాగరికత వీరికి అలవడ లేదు, వారి ప్రభావం వీరిమీద పడలేదని, ఆర్యులు సవరవారిని వింధ్య పర్వతాలలోనికి తరిమి వేశారని చరిత్రకారుల అభిప్రాయం. ఆర్యులు హిందూ దేశానికి రాక పూర్వం ఈ శబరులు ఉత్తర దిశను గంగానది నుండి దక్షిణమున గోదావరివరకు గల ప్రాంతములో ఉండేవారు. పల్లపు ప్రదేశాలను వదిలి పర్వత ప్రాంతాలలోనికి పోయిన ఈ సవరలకు వింధ్య మౌలికులన్న పేరు వచ్చింది. ఆ వింధ్య పర్వత ప్రాంతాలనుండి నేడు వారుంటున్న తూర్పు కనుమలలోనికి సుమారు వెయ్యి సంవత్సరాల క్రితం కొంతమంది వలస వచ్చారు. కొంతమంది మధ్య ప్రదేశ్ అడవులలోనికి వెళ్ళారు. ఇతర రాష్ట్రాలలోని శబరులకు కాలక్రమేణా కొత్త పేర్లు వచ్చినవి. కాని వారిలో గూడ సవరజాతివారుగా ఒక తెగవారున్నారు.

మన ప్రాచీన వాఙ్మయంలో మన కవులు శబరులను వింధ్య మౌలికులుగా పేర్కొన్నారు. వీరిని అడవి మనుష్యులుగాను, బోయవారిగా మాత్రమే చిత్రించారు. కాని వీరిలో కొంతమంది కొన్ని ప్రాంతాలను పరిపాలించినట్లు చారిత్రిక నిదర్శనాలున్నాయి. శబరాదిత్యుడనే ఒక సవరరాజు క్రీ.శ. 720 సంవత్సరంలో కళింగ దేశంపైకి దండెత్తి రాగా కళింగదేశరాజు కామార్ణవ అతనిని ఓడించినట్లు, క్రీ. శ. 736 వ సంవత్సరంలో నెల్వేలిక్షుద్ర ఉదయ చంద్రుడు ఒక సవరరాజును ఓడించినట్లు మనకు చరిత్రవల్ల తెలుస్తున్నది.

సుమారు 50 సంవత్సరాల క్రితంవరకూ సవరలు అప్పుడప్పుడు కిరాతకంగా ప్రవర్తిస్తూండినట్లు కొందరంటారు. ఈ నాడు వారు కిరాతకంగా ప్రవర్తించరు గాని కొత్తవారిని చూసి భయపడతారు. కాని వారి భాషలో వారితో ప్రసంగిస్తే ఎవరైనా వారి స్నేహాన్ని సంపాదించవచ్చును. వారి స్నేహాన్ని పొందకుండా వారి సంక్షేమానికి పాటు పడదలచుకొన్న వారికి ఏటికి ఎదురీతే అవుతుంది.

ప్రకృతి సిద్ధంగా లభ్యమయ్యే సంపత్తితో సవర దేశాన్ని సౌభాగ్య వంతం చేయవచ్చును. కొండవాలులలోను, కొండలోయలలోను నేల ఎంతో సారవంతమయింది. వరి మొదలైన పంటలనే కాక అనేక రకాలైన పండ్లను ఆ అడవి ప్రాంతాలలో పండించవచ్చును. తేనె, పసుపు, చింతపండు, కుంకుడు కాయలు, షీకాయి, పాలగుంద, తేకు, మద్ది, గుగ్గిలము మొదలైన అటవీ సంపద సవర దేశంలో విరివిగా లభ్యమౌతుంది. వీటికి సంబంధించిన లఘు పరిశ్రమలను ప్రభుత్వ గిరిజన సంక్షేమ శాఖవారు నెలకొల్పడమే కాక, వ్యవసాయం, వడ్రంగం, కంచరిపని మొదలైన వృత్తులలో సవర యువకులకు శిక్షణ ఇవ్వడానికి కేంద్రాలను నెలకొల్పవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది. వారి మతం పట్ల, వారి జీవిత విధానాల పట్ల తగినంత ఆదరణ చూపిస్తూ వారికి వివిధ వృత్తులలో తగిన శిక్షణ ఇస్తే వారి ప్రాంతాలను సులువుగా అభివృద్ధి పరచవచ్చును. గిరిజన సంక్షేమ కార్యక్రమాల పనులను వీలయినంత వరకు గిరిజనుల చేతనే చేయించే ఏర్పాట్లను ప్రభుత్వం చేయాలి. వృత్తి విద్యలను సవరవారికి వారి భాషలో నేర్పితే వారు ఉత్సాహవంతంగా శిక్షణ శిబిరాలలో చేరతారు.

(తరువాయి 49వ పేజీలో)

# ఏదులాబాదు శ్రీరంగక్షేత్రము

శ్రీ ఎస్. ఆర్. సోమేశ్వరశర్మ
"మహేష్"



మానవజాతి చరిత్ర చూస్తే, మానవుడు సహజంగా కళోపాసి అనిపిస్తుంది. తాను భావించిన వాటికి రూపులు దిద్ది ఆరాధించి, ఆ ఆరాధనలో ఆనందాన్ని పొందుతున్నట్లు తెలుస్తుంది. ఈ కళకు ఆధ్యాత్మిక చింతన కూడా క్రమంగా తోడై, మానవుని జీవితమే కళామయమై వర్ధిల్లుతుంది. వీటి ఫలితమే భారతదేశంలో నలుమూలలా, ఊరూరా, కొండకొండన దేవాలయాల శోభ, ఆచార్యుల ప్రతిభ, ఆధ్యాత్మికవేత్తల అవిరళకృషి ఫలితాలు చోటు చేసుకున్నాయి.

ఇటువంటి మహత్తర మధుర భావనలకు రూపుపొందిన క్షేత్రమే ఏదులాబాదు శ్రీ రంగనాయక దేవాలయం. ఈ గ్రామానికి ప్రాచీననామం లక్ష్మీనారాయణపురం. గ్రామనిర్మాణం కావింపబడి ఐదు శతాబ్దాలకు పైన అయింది. బహుశా మహమ్మదీయుల పాలనా కాలంలో గ్రామనామం ఏదులాబాదుగా మారి వుండవచ్చునని నా అభిప్రాయం. చారిత్రిక నిదర్శనాలు యింతవరకుగాను మనకు ప్రస్తుతం ఏమీ లభించడంలేదు. ఈ గ్రామ పుట్టుపూర్వాల వైచిత్రి, పరిసర సుందర ప్రకృతి అత్యంత ఆహ్లాదకరమైనవి.

ఈ పవిత్రస్థలి ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరమగు భాగ్యనగరానికి 32 కిలోమీటర్ల దూరంలో హైదరాబాదు–విజయవాడ రైలు మార్గంలో ఘటకేశ్వరం రైలుస్టేషన్‌కు 5 కిలోమీటర్ల దూరంలో పరిఢవిల్లుచున్నది. నిత్యము ఆంధ్రప్రదేశ్ రోడ్డు, రవాణావారి బస్సు వసతిసౌకర్యాలుకూడా గలవు. గతచరిత్ర ఎలావున్నా, యిప్పటికి సుమారు 850 సంవత్సరాల పూర్వంనుండి గ్రామచరిత్ర, గ్రామంలోని వివిధ నిర్మాణాల చారిత్రిక ఆధారాలు విపులంగా పరిశోధకులకు లభ్యం కాగలవు.

శ్రీరంగనాయక దేవాలయం నిర్మాణ చరిత్ర గూర్చి ఒక్క కథను చిత్రించు చక్కని ప్రాంతీయ గాథ వుంది. ఇప్పటికి సుమారు వందల ఏబది సంవత్సరాల క్రితం తిరువడిదన్ పూవత్తి అప్పలాచార్యులవారు కుటుంబసమేతంగా దక్షిణాపథంలోని శ్రీరంగక్షేత్ర దర్శనార్థం ప్రయాణం చేస్తున్నారు. ప్రయాణసమయంలో ఒకరాత్రి ప్రస్తుతపు ఏదులాబాదు దేవాలయ ప్రదేశంలో మకాం చేయవలసి వచ్చింది. ఈయన చక్కని కళోపాసి ఆధ్యాత్మిక చింతనగల వ్యక్తి. ఆనాటి రాత్రి ఆయనకు స్వప్నంలో ఆండాళదేవి కన్పించి, వారు విడిచిన ప్రదేశం పవిత్రమైందని, అచ్చట దేవాలయం నిర్మింపజేయుమని ఆదేశించిందట. దేవేరి ఆదేశమే ఆ భక్తుని దేవాలయనిర్మాణానికి ప్రోత్సాహం కల్పించింది. ఆయనచే శ్రీరంగనాయక దేవాలయం నిర్మించబడి ఆయన వంశస్థులచే కాలానుగుణంగా పెక్కుభంగుల దేవాలయం పెంపును, ప్రాభవాన్ని పొందింది. క్షేత్రం సుమారు ఎకరపు ప్రదేశంలో నిర్మించబడింది.

అనేకవేల రూపాయల ధనవ్యయంతో, వివిధ భక్తుల ధార్మికసహాయ సంపత్తులతో సర్వాంగ సుందరంగా గర్భాలయం నిర్మించబడింది. విమానగోపుర పర్యంత శిల్పసంపదతో అత్యున్నతంగా నిర్మించబడింది. గర్భాలయమున ప్రధాన దేవతలగు శ్రీరంగస్వామి, ఆండాళదేవి, ధృవమూర్తులు అత్యంత మనోహరముగా మలచబడ్డాయి. ఆలయప్రాంగణమునందు ఆళ్వార్లు, ఆచార్యులు, ఆంజనేయులు, ఉభయవరుల మూర్తులు వేరువేరుగా ప్రతిష్ఠింపబడినవి. దక్షిణ దేశమునందలి ఆలయమువలె ఏదులాబాదు శ్రీరంగాలయం కూడా శోభాయమానమై భక్తులను ఆకర్షించుచున్నది.

అప్పలాచార్యుల వంశంలోని శ్రీవిష్ణు చిత్తమాచార్యుల వారిచే గోపురనిర్మాణం కావింపబడింది. గోపుర వెనుకభాగాన నిర్మాణశేషము పూర్తి కావించవలసివుంది. ఇది పూర్తి అయినచో క్షేత్రము సర్వాంగ సుందరముగా రాగలదనే నమ్మకం భక్తులందరకు

వుంది. దేవాలయ పోషకులకు శ్రద్ధతోపాటు శక్తి కూడా కావలెను. వస్తువులధర పెరిగినదాదు, పోషకుల ఆర్థికస్తోమత సన్నగిల్లినదాదు ఏ మహనీయుడో తలుచుకొంటేగాని ఈపని పూర్తికాదు.

నిర్మాణ కాలంనుండి ఈ క్షేత్ర నిర్వహణకు నిత్య ధూప,దీప నైవేద్యాది భోగాదులకుగాను భక్తులిచ్చిన దానాలే ఆధారాలు. దేవాలయానికి భూములున్నా, పండేవనరులు లేక చాలా భాగం అసేద్యంగానే వుంది. భక్తులిచ్చిన దాన పత్రాలు అప్పలాచార్యుల వారి వంశస్తుల వద్ద నేటికీ వున్నాయి. 1136, 1166 ఫసలీ సంవత్సరాల దాన పత్రాలు, క్రీ. శ. 1736, 1741 సంవత్సరాల భూదాన పత్రాలు యిందు ముఖ్యమైనవి. ఇవి అప్పటి ప్రాంత చరిత్రను, దానాలొసంగిన వారి కుటుంబ చరిత్రను చక్కగా వర్ణిస్తాయి.

దేవాలయం తూర్పు ముఖంకేసి విశాల ప్రదేశంలో నిర్మితమై గంభీరంగా చూపరులకు కన్పించ గలదు. గోపుర ద్వారం గుండా భక్తులు దేవాలయ ప్రాంగణంలోకి చేరుకొనవచ్చు. గర్భాలయంకు ముందుగల విశాల మండపంపై శిల్పశోభలు చిలకరిస్తున్న అనేక శిల్పాలు గలవు. అందు సూర్యనారాయణ విగ్రహం అత్యంత ఆకర్షణీయమైంది. ఉత్తర దిశలో స్వామి పుష్కరిణి గలదు. దీని జలాలు మహత్తును కల్గియున్నవని ప్రాంతీయుల నమ్మకం.

మూల విరాట్టుల దర్శనంతో మనలో విప్పిచెప్పలేని పవిత్ర భక్తి భావన కలుగుతుంది. లోభ మోహాలు త్యజించబడి, భక్తులు ఆధ్యాత్మికానంద సాగరంలో మునకలు వేస్తారు. ఇది నిర్మాత మహత్యమో, స్థల మహత్యమో, స్వామి తేజస్సో చెప్పలేం. దీనికి గరుడాద్రి అనే క్షేత్రనామమున్నట్లు ప్రాచీన ఆధారాల బట్టి తెలుస్తున్నది. కాని ఈ నామం అంత ప్రాచుర్యంలోనికి రాలేదు.

నిర్మాత వంశస్తుల నిర్వహణలోనే క్షేత్రము ప్రసిద్ధి పొందుచున్నది. దేవాలయానికి సంబంధించిన అలంకరణలు, కట్టె పని మొదలగు వాటిని నిర్వాహకులు కుటుంబ వ్యక్తులే, పెద్ద, చిన్న అని తేడా లేకుండా శ్రద్ధగా చేయడం, ఆపనుల్లో ఆనందాన్ని పొందడం మెచ్చుకోదగ్గది. దేవాలయ సంబంధమైన ప్రతీ కార్యంలో వీరు ఆధ్యాత్మికానందం పొందుతున్నారు.

ప్రతి సంవత్సరము ఆషాఢ బహుళ త్రయోదశి నుండి శ్రావణ శుద్ధ సప్తమి వరకు (జూలై- ఆగస్టు నెలల్లో) ఘనంగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఉత్సవ విగ్రహాల ఊరేగింపులో వేలాది జనం పాల్గొంటారు. ఇవి గాక వైష్ణవ సంబంధమైన పెక్కు ఉత్సవాలు సాలుపొడుగునా గొప్పగా సాగుతాయి. భక్తుల సంఖ్య ఎంతవున్నా నిర్వాహకుల పోషణశక్తి ఏమైనా, ఉత్సవ సమయాల్లో వచ్చిన భక్తకోటికి ఉచిత భోజన సదుపాయాలు లేదనకుండా జరుగుతాయి. ఈ ఆచారం అనాదిగా వస్తోంది. ఇది ఎంతో శ్లాఘనీయమైన విషయం.

క్షేత్ర మహత్యం గూర్చి అనేకానేక గాథలున్నాయి. నిస్సంతువులు దూర ప్రాంతాలనుండి కూడా వచ్చి, ఈ క్షేత్రాలలో నిద్రలు సల్పి. స్వామిని, కొల్చి, సంతానం పొందిన ఉదాహరణలు కోకొల్లలు, అంధులకు దృష్టి ప్రదాత శ్రీ రంగ నాయకులనే నమ్మకం కూడా చాలా దృఢంగా భక్తులకున్నది. మత్రిపల్లె గ్రామవాసి అయిన ఒక అంధ యాదవునకు ఒక నెలరోజుల పాటు స్వామి సన్నిధిని కాలం గడుపుటవలన, పుష్కరిణిలో స్నానాలు చేయుట వలన దృష్టి తిరిగి వచ్చిన విషయం యిటీవలి దృష్టాంతం.

దేవాలయ ప్రాంగణంలో గర్భ గుడికి ఎడమ వైపు శోభలు నింపుకున్న విశాలమైన అద్దాల మండపం వుంది ఇందులోని అద్దాల అలంకరణ, స్తంభాల తీరు చూపరుల నేత్రాలను అట్టే ఆకట్టుకొనగలవు గజేంద్రమోక్ష దృశ్యం, దశావతారాలు, పలు రద్వ వర్ణ చిత్రాలు చెప్పుకోదగ్గవి ఈ అద్దాల మండపాన్ని బాగుచేయించాల్సిన అవసరముంది. లేనిచో గత శోభలు కర్కశ కాలపురుషుని కబంధ హస్తాల్లో నాశనం కాకమానవు సామాన్య ఆర్థిక సంపత్తి గల రెండు మూడు వైష్ణవ కుటుంబాలు శ్రద్ధ తీసుకొని క్షేత్రాన్ని కాపాడుతోన్న విషయం యింతకు ముందే చెప్పబడింది. ధనముకన్నా మానవుని భావనాశక్తియే మిన్న అన్న సత్యాన్ని ఏదులాబాదు శ్రీ రంగక్షేత్ర నిర్వాహక విషయం తేట తెల్లం చెస్తుంది. కేవలం శక్తియే ఒక్కొక్కప్పుడు చాలక పోవచ్చు. దేవాలయ ధర్మాదాయ శాఖవారు శ్రద్ధ తీసుకొని శ్రీ రంగాలయాన్ని పెంపు చేయడం ఎంతో అవసరం.

ఏదులాబాదు శ్రీరంగక్షేత్ర ప్రాధాన్యాన్నే గాక అనేకానేక నిర్మాణాలతో పెంపు గాంచింది. క్రీ.శ. 17వ శతాబ్దంలో రెండవ భాగాన గోల్కొండను పాలించిన తానీషా మంత్రులగు అక్కన్న. మాదన్నల కాలంలో ఈ గ్రామం ప్రాభవాన్ని పొందినట్లు యిచ్చట ప్రాచీన నిర్మాణాలు తెల్పుతాయి. వీరి కాలంలో ఈ గ్రామాధికారి నారాయణరావు అక్కన్న, మాదన్నల ప్రోత్సాహంతో తన తల్లి పేరు, గ్రామంపేరు కలిసి వచ్చునట్లు ఒక విశాల తటాకాన్ని "లక్ష్మీనారాయణ సాగరం" అనే పేరుతో నిర్మించాడు. ఇది



చాలా ప్రజోపకరమైంది. దీనిక్రింద అనాడు 1200 ఎకరాల భూమి సాగు అయ్యేది. కొంతభాగం మెట్ట వేయడంవల్ల, నీటివసతులు తగ్గడంవల్ల అంత సాగు ప్రస్తుతం లేదు. దీనిని ప్రభుత్వం బాగు చేయిస్తే, ఎంతైనా ఉపయోగ పడగలదు.

గ్రామంలో గోపాలస్వామి ఆలయం, శివాలయం, శ్రీరామాలయం, ఆంజనేయాలయం, మొదలగు ప్రాచీన దేవాలయాలు చాలా వున్నాయి. ఇందు శివాలయం పూర్తిగా శిథిలమైంది. గోపాలస్వామి ఆలయం క్రింద 400 ఎకరాల భూమి వున్నట్లు చెప్పబడుతోంది. నిత్యదీపారాధన వుంది, శ్రీ ముఖ మాఘ శుద్ధ పంచమి నాడు చక్కని రథం చేయించ బడింది.

శ్రీ రామాలయానికి కూడా నిత్య దీపారాధన వుంది. ప్రస్తుతం ఉద్యోగాన్ని విరమించిన ఒక వృద్ధ సైనికోద్యోగి శ్రీ జగన్నాథరావు పూజారిగా వుంటూ, ఈ మారుమూల గ్రామంలో తన శేష జీవితాన్ని గడుపుతున్నారు.

గ్రామ వైభవాన్ని, నిర్మాణాల ప్రాశస్త్యాన్ని తెల్పే ఎన్నో శాసనాలున్నాయి. చింతలబావి అని పిలవబడే ప్రాచీన జలాశయమొకటి వుంది. నారాయణరావు వేసిన శాసనమొకటి, ఆంజనేయస్వామి ఆలయంవద్ద శాసనం బండ అని పిలవబడే మరొక శాసనం, నెల్లూరి నారాయణ గారిచే వేయబడిన మూడవ శాసనం ప్రాంత చరిత్రను తెల్పగలవు. మూడవ శాసనం బోయ రాజు చెరువు వద్ద నిర్మించిన వద్దెర వాని గొప్పను తెలుపుతుంది.

స్థల మహాత్మ్యం, చారిత్రిక ప్రాధాన్యం గల ఏడులాబాదు క్షేత్రాన్ని ప్రతి తెలుగు వ్యక్తి చూసి తీరవలసిన ప్రదేశమనటంలో అతిశయోక్తి లేదు.



## గిరిజన సంక్షేమం . . .

(16వ పేజీ నుండి)

సవరల భాష, మతం, జీవితవిధానం భిన్నంగా ఉండటం వల్లనే వారు మొదట అనుమానంతో, భయంతో ప్రవర్తిస్తారు. కనుక వాటిని మనం గౌరవించాలి.

వారి మతాన్ని గురించి సులువుగా చెప్పడం కష్టం. దుష్ట భూతాలను, వారి పెద్దల ఆత్మలను శాంతింపజేయడానికి వారు తరచుగా ఎనుబోతుల్ని, పందుల్ని, మేకపోతుల్ని బలియిస్తూ ఉంటారు. కల్లును ఆహారంగా పెడుతూ ఉంటారు. కల్లు త్రాగని సవరవ్యక్తి మనకు కనబడడు. అలాగని అతిగా తాగి ఘోరాలు చేయరు. వారు అబద్ధాలు ఆడరు. వారిలో వ్యభిచారం లేదు. వారి చరిత్రలో నరబలుల గురించి వినబడదు.

పల్లపు ప్రదేశాలలోని పల్లెలలోను, పట్నాలలోను స్థిర నివాసం ఏర్పరచుకొన్న కొందరు సవరలు హిందూమతాన్ని స్వీకరించారు. వారికి కాపు సవరలన్న పేరువచ్చింది. క్రిష్టియన్ మిషనరీలవారు గత నూరు సంవత్సరాలలో సవరవారికి కొన్ని ఉపకారాలు చేసి వారిని వారి మతం స్వీకరించేటట్టు ప్రయత్నించారు. కొన్ని గ్రామాలవారు ఉమ్మడిగా క్రైస్తవ మతం స్వీకరించారు. కాని ప్రత్యేక వ్యక్తులు క్రైస్తవ మతం స్వీకరించడం జరుగలేదు. క్రైస్తవ సవరలు, సవరలు సహపంక్తి భోజనాలు చేయరు. కాని వారంతా కలిసి పండుగ వేడుకలలో పాల్గొంటారు. మత వైషమ్యాలు వారిలో లేవు.

గిరిజనుల సంక్షేమంకోసం భారత ప్రభుత్వం అనేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ఈ సంక్షేమ కార్యక్రమాలతో సంబంధమున్న ప్రభుత్వోద్యోగులు ఆయా కొండజాతులవారి భాషలను నేర్చుకోవడం అవసరం. అందులో ముఖ్యంగా సవర వారితో సంబంధమున్న ఉద్యోగులు సవర భాషను నేర్చుకోవడం ఎంతో అవసరం. పిల్లలకు వారి భాషద్వారానే విద్యాబోధనను చేయాలి. తెలుగు, ఒరియా భాషలను వారు సులువుగా నేర్చుకోలేరు.

సంతాలీ, ముండారి, బిర్హోర్, హో, కోర్వా మొదలైన ఉత్తర భారతదేశ ఖేర్వారీ కుటుంబ భాషలకు, పరెంగ్, రేమో, గదబ మొదలైన దక్షిణ భారత కొండజాతి భాషలకు, ఖారియా, జుఆంగ్, ఖాసీ మొదలైన భాషలకు సవర భాషకు దగ్గర సంబంధమున్నందువలన సవరభాషాభివృద్ధికి ప్రభుత్వంవారు శ్రద్ధ తీసికోవలసిన అవసరముంది. సవరలకు పరభాషలను బలవంతంగా బోధించి వారి భాషయెడల అశ్రద్ధ చూపిస్తే సవర భాష క్షీణించి, నశించే అవకాశముంది. సవర భాష నశిస్తే భారత దేశానికి చెందిన ఆస్ట్రిక్ భాషా కుటుంబానికి భాషాశాస్త్రపరంగా తీరని అన్యాయం జరుగుతుంది.

గిరిజనుల పునరావాస కార్యక్రమాలను నిర్వహిస్తున్నప్పుడు వారి మనుగడకు అవసరమైన వేడుకలు, మతం, భాషా మొదలైన వాటికి రక్షణ అవసరం. ప్రపంచంలో మంచిచెడ్డలను, వారి అలవాట్లు ఆటపాటలు, ద్వారా ఆనందానుభవాలద్వారానే వారికి తెలియజేయాలి. వారి సంప్రదాయాలకు, కట్టుబాట్లకు వారిని దూరం చేయకూడదు వారిని సరైన మార్గంలో తీర్చి దిద్దితే వారు భారత దేశాభివృద్ధికి ఎంతో తోడ్పడ గలరు.

సీరియల్

# ఎవరికోసం

కోట కమలాదేవి

కనుచూపు మేరలో అక్కడక్కడ పల్లెటూరి పందిరిలో చిన్న చిన్న ఇళ్ళు కనబడసాగాయి. "అదేనా ఊరు?"అన్నాడు కేశవ.

"అదేనయ్యా! వచ్చేసినాము. నడక అలవాటు లేనట్లుందే మీకు! పట్నంవాళ్ళు కారుల్లో, బస్సుల్లో పోతారు. మరి మాకు బాగా నడిచే అలవాటు. ఇంతకీ మీ పేరేంటి బాబూ" అన్నాడు.

"నా పేరా. కేశవరావ్" అన్నాడు.

"మరి నీ పేరేమిటి" అడిగాడు కేశవ చిన్నగా నవ్వుతూ అద్వైతు బిడ్డకేసి చూసి.

'నాపేరు .....కిష్టయ్య. మా మామ్మ ముద్దుగా కిష్టప్పా అంటుంది' అన్నాడు.

'సరేకాని కేశవరావు గారు......నాకు ఓ సందేగం ఉంది. అడిగితే చెపుతారా?' అన్నాడు మళ్లా....

"అడుగు ...దానికేం తెలిస్తే చెప్తానూ..."

"అడగమంటారా... నగకండేం మరి... నాకూడా... నాటకాలు... సినిమాలు...వెయ్యాలని ఉందండి. అది ఎట్టాగో, కాస్త చెప్పండి. మీవంటి చదివినవారు చదవని వాళ్ల కూడా సినిమాలు వేయచ్చుటగా" అన్నాడు. అతి అమాయకంగా ఎంతో ఆసక్తి కల సినిమానటులందర్నీ కడుపులో నింపుకున్నంత సంబరంగా తనో పెద్దయాక్టరై పోవాలన్న అభిలాషతో.

కేశవ పకా పకా నవ్వుకుంటూ, వచ్చే నవ్వును ఆపుకుందుకు ప్రయత్నిస్తూ, "సరే కిష్టయ్యా నీకింతకీ సరదాగా ఉందా, సినిమాల్లో నటించాలని...అయితే ముందు బాగా నాటకాల్లో నటించి, పెద్ద పెద్ద వాళ్లందర్నీ మెప్పించి మెప్పు, గొప్ప సంపాదించాలి"...

"అదేనండి! ఈ రోజు మీరు మవూరు రావడం నాకు ఇలా పరిచయం కావడం నా అదృష్ట మనుకోండి,... అసలు ఇంతకీ నేను సినిమాలకి, నాటకాలకి, సరిపడ్డంత అందంగా ఉంటానాండీ? మామ్మ... అయితే మన్మధుడు అని ముద్దాడేస్తుందండీ, కాస్త చదువు కూడా వస్తాది నాకు" అంటూ వాడి స్వంత డబ్బా కాసేపు వాయించు కుంటూండగానే వాళ్ళ నడక పొలాలు, తోటలు దాటి వూళ్లో పడింది.

ఊరు మొదటే ఒక ఇల్లు. ఆ ఇంటికి కొంతభాగం పెంకులు, కొంత భాగం డాబా వేసి, వీధి వాకిట్లో రెండు ప్రక్కలా పెద్ద అరుగులు గచ్చుచేసినట్లు ఉన్నాయి. ఇంటికి నాలుగు ప్రక్కలా విశాలమైన స్థలం చల్లని చక్కని వృక్షాల నీడతో నిండి ఉంది, ఆ ప్రదేశమంతా. ఇంటి చుట్టూ రకరకాల పూలమొక్కలు, మల్లెలు మొదలయిన పెద్దపెద్ద దుబ్బులు ఉన్నాయి. ఎర్రని తురాయిపూలు కళ్ళు జిగేలు మనేలా ఎర్రచీర కప్పినట్లున్నాయి. ఇంటిచుట్టూ కాంపౌండువాల్ లేదుగాని అలాగే దిట్టంగా కప్పిన తాటాకుల దడి, ఆ ప్రదేశమంతా ఎయిర్ కండిషన్ రూమ్‌ను మరిపిస్తోంది.

"ఇదేనండీ, ఆ సినిమాస్టార్ ఇల్లు. ఈ ఊళ్ళో ఆ అమ్మాయి గార్ని అందరం సినిమాటార్ అనే అంటామండీ, ఏమనుకోకండి" అంటూ "నేను వెళ్ళి వత్తానండి మరి, ఇంకా నాలుగు దినాలుంటారుగా మళ్ళా ఓసారి మీ దర్శనానికి వస్తానండి. మరి సెలవా"అంటూ కిట్టయ్య నిష్కల్మష హృదయంతో మనసిచ్చి మాట్లాడిన మనిషి కేశవ దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

కేశవ నెమ్మదిగా దడిదాటి లోపలకు కాలుపెట్టాడో లేదో, చిన్న తెల్లని బొచ్చు కుక్కపిల్ల సన్నని గొంతుకతో 'బౌఉ్ బౌఉ్' మని మొరిగింది. దాని మొరుగు విని లోపల నుండి నాజూకుగా, 'రాణీ, ఎవరు వచ్చారు...'అన్న ఇంకో నాజూకైన గొంతు, సొగసుగా వినపడింది.

'అమ్మయ్యా!' అనుకున్నాడు కేశవ, అది నీల కంఠమే అని తెలిసింది. ఇంతలో ఒక పెద్ద స్త్రీ తలుపుతెరచి బయటకు తొంగి చూచి 'ఎవరికోసం బాబూ...'అని ప్రశ్నించింది.

'ఇది సుబ్బయ్యగారిల్లేనా!...'అన్నాడు కేశవ సంకోచంగా.

'అవును, ఆయన ఇప్పుడే అడ్డదారంబడి స్టేషన్‌కి వెళ్ళినారు. మీకు ఆయన కావాలా?' అని ప్రశ్నించింది.

"వాళ్ళ అమ్మాయి 'నీల'గారు ఉన్నారా...పోనీ"...అన్నాడు సంకోచంగా.......

కేశవగొంతు గుర్తుపట్టింది నీల...గబగబ బయటికి వచ్చి, 'హల్లో కేశవరావ్, పూవులేని కాయలాగా, మబ్బులేని వానలాగ వచ్చేశావ్...ఇంకా వచ్చేరోజు తెలియపరుస్తూ లెటర్ వ్రాస్తావు

అనుకున్నాను. సర్‌ప్రైజ్ విజిట్! రా...రా..." అంటూ నీల కేశవను లోనికి ఆహ్వానించింది.

కేశవకి ప్రాణం లేచివచ్చింది. ఇంట్లో వంటమనిషి గంగమ్మని చల్లని మంచినీళ్ళు తెమ్మని ఆజ్ఞాపించింది నీల.

వెంటనే గంగమ్మ ఒక కూజాలో చల్లనినీళ్ళుపోసి పచిరం గాజుగ్లాసుపైన పెట్టి తెచ్చి నీలకి అందించింది. నీల కూజాలో నీళ్ళు గ్లాసులోపోసి కేశవకు ఆప్యాయంగా అందించింది. 'మంచి ఎండలో వచ్చారు రైలు ఈరోజు లేటా!'...అంది.

'ఈరోజు ట్రైన్ నాలుగుగంటలు లేటు, పది గంటలకు రావలసిన బండి రెండు గంటలకి వచ్చింది. అంటూ చేతిని ఉన్న వాచీలో చూసుకున్నాడు. సరిగ్గా మూడు కావొస్తూంది. 'అబ్బా! స్టేషన్ ఊరికు చాలాదూరం వుందే ఇక్కడ బండి, రిక్షా యేమీ లేవా?' అన్నాడు

'ఈ ఊరు ఒక అడవిపల్లె అనుకోండి, పాపం చాలా శ్రమ పడి వచ్చారు' అంది నొచ్చుకుంటున్నట్లు ధ్వనించేలా...

'చల్లనినీళ్ళ స్నానం చేయండి ముందు, కాస్త హాయిగా ఉంటుంది' అంది.

ఇంతలో రంగయ్య వచ్చి 'అమ్మా నూతిలో నీళ్ళు బాల్చీల నిండా తోడిపెట్టాను' అన్నాడు.

'రంగయ్యా సబ్బు......తువ్వాలు పట్టుకెళ్ళి, అయ్యగారికి స్నానాలగది చూపించు.'

అట్టాగేనంటూ రంగయ్య ముందు నడిచాడు. కేశవ అతన్ని అనుసరించాడు.

నీల వెడుతున్న కేశవ వైపు చూస్తూ వరండాలో నిలబడి ఆ ఇంట్లో తను, తండ్రి సుబ్బయ్య, తప్ప మూడవ మనిషి పాదం పెట్టి ఎరగని నీల హృదయంలో సంతోషం కళ్ళల్లో కాంతి రేఖలు వెదలాడాయి. కేశవ రాక వల్ల ఆత్రుతగా లోపలకు వెళ్ళి గంగిని వంట తొందరగా చేయమంది. నీల ఆరాటం చూస్తే గంగి గుండెల్లో కుంపటి వెలిగింది. 'ఎవరో వయస్సులో ఉన్న కుర్రాడంటే ఈమెకింత ఉబలాటం ఎందుకో' ...అని లోపలే రుసరుస లాడింది.

కేశవ స్నానం చేసి వచ్చి హాయిగా భోజనం చేశాడు. నీల దగ్గరే కూర్చొని ప్రతీది మరోసారి వడ్డించమని గంగిని హెచ్చరిస్తూ, చక్కని మామిడి పండు చాకుతో తొక్కలు తీసి, కోసి 'ప్లేటులో వేసి కంచం దగ్గర పెట్టింది'. ఫానులు లేవు మాఇంట్లో ...అంటూ వెళ్ళి తాటాకుతో కట్టిన విసినికర్ర తెచ్చి విసర బోయింది. కేశవ వద్దని ఆమె చేతిలో పంకా అందుకొని విసురు కుంటూ "ఇంత చల్లని ప్రకృతి గాలి ఉండగా కృత్రిమమైన ఆ కరంటు ఫాను లెందుకు? విద్యుత్ పంకాలను మించిన ఫలవృక్షాలు సౌమ్య మైన చల్లదనాన్ని అందిస్తున్నాయిగా" అన్నాడు నీల వైపు చిరు మందహాసంతో చూస్తూ.

కేశవ ప్రయాణ బడలిక, ఎండ వేడికి అలసి పోయాడు. భోజనం చేసి కొంత సేపటికి విశ్రాంతి తీసుకున్నాడు సాయం కాలం నీరెండ పచ్చని చెట్ల మీద మెరిసింది. నును సిగ్గు క్రమ్మిన యవ్వనపు ముఖంలా వుంది, ఆ ప్రకృతి.

వెంట నీల ఇద్దరు తమ్మని పొలాలకు దారితీశాడు. లేచి అలా మామిడి తోట వైపు తిలకిస్తూ నెమ్మదిగా అడుగులు నడిచాడు.

'మా ఊరు ఎలా ఉంది?' అంది వెనకాల వస్తున్న నీల.

'మీ ఊరికేం ప్రకృతి సౌందర్యం, సౌభాగ్యం అంతా ఒక చోట అప్పచెప్పినట్లు ఉంది ఎటుచూసినా ఫలవృక్షాలు ఎలా ఉన్నాయో తెలుసా! మహా పండితులతో నిండిన సభలా ఉంది. ఇలాంటి ప్రశాంత వాతావరణంలో బ్రతికితే ఎన్ని కథలు, నాటకాలు రాయవచ్చు. ఏ చాంచల్యం రాగద్వేషాలు లేకుండా, నిర్మలమైన ప్రకృతి రసాన్ని గుటకలువేస్తూ...వుంటే ఐడియాస్ ఊటలా వూరు కొస్తాయి' అన్నాడు కేశవ నీలవేపు చూస్తూ. నీల చిలిపిగా నవ్వుతూ, 'అబ్బా! మా శుద్ధ పల్లెటూరిని ఎంతగా పొగుడు తున్నారు!' ఆ పల్లెని నిశ్శబ్దాన్ని చీలుస్తూ కోకిల కూసింది, రక రకాల వింత పక్షులు సన్నని నాదం చేస్తున్నాయి.

'చూశావా నా మాటకి సాక్ష్యంగా కోకిల ఎలా కూసిందో' అన్నాడు.

'అవునులెండి అవి మీతో మాట్లాడకపోతే మాతో మాట్లాడు తాయా?' అంది.

'మరి మీ వూరు పక్షులు నాతో మాటలాడకపోతే, నీతో మాటలాడదాయా?... నిజం ఎవరిదో వాళ్ళ తరఫున మాట్లాడతాయి అంతేగా!' అన్నాడు కేశవ, ఇద్దరు కిలకిల నవ్వారు.

'నీలా! నిజంగా ఇంత బాగుంటుంది అనుకోలేదుసుమా... అందుకే హాయిగా ఇక్కడే ఉండిపోయావు రానమ్మనమని రాస్తున్నావు...బాగుండదూ...మళ్ళా...'

'మళ్ళా?...ఆపేశారేం మాట' అంది నీల.

'అద్బే ఏం...లేదు...మా నాన్నగారు, ఎం. ఏ. ప్రైవేటుగా చదవమంటున్నారు. ఆ చదువులోపడితే ఇంక...రావడానికి... వీలు పడదనీ...'

'అని, ఇప్పుడే వచ్చారా...' అంది.

'ఆ...' అన్నాడు కేశవ పరధ్యాన్నంగా, అతని మాటలో ఏదో సందేహం గోచరిస్తోంది.

'సరేగాని......మన పోటీ నాటకం డేటు ఎప్పుడో తెలిసిందా?' అంది.

'తెలిసింది. త్వరలోనే...ఉంది. అప్పటికి నీవు కాస ముందుగావస్తే అందరం కలిసి పది రిహార్సల్సయినా చేయాలి... అన్నాడు.

'మరి మీ నాన్నగారు ఒప్పుకుంటారా?'

'అలా నాన్నగారు సులువుగా వప్పుకుంటారా? ఎల్లాగో

ఒప్పించాను. ఈ ఒక్కసారి...ఇంక జన్మలో నాటకం స్టేజి ఎక్కను. మీ మాట పాటించి ఎం. ఏ. ప్రైవేటుగా చదువుతాను అని ప్రామిస్ చేశాను...నీకు ప్రైవేటుగా కాకపోతే తెలుస్తుంది మార్కులు బి. ఏ. కి, పైగా ఆ బి. ఏ. ప్యాసవడానికి ఒక పంచవర్ష ప్రణాళిక పట్టినవాడికి, ఎవ్వరూ కాలేజీలో సీటు ఇచ్చేది...ఈ ఎం. ఏ కి ఓటు రెండో పంచవర్ష ప్రణాళిక పూర్తి అవుతుందని దీవించి మరీ ఒప్పుకున్నారు !' అన్నాడు.

'అయినా మరీ మీరు...అతిశయోక్తిగా చెప్పారు ... అలా మిమ్మల్ని ఎప్పుడూ...అనకు...మీ అంత మంచి పునాది ఇంగ్లీషు ఏ ఎం. ఏ. క్లాసొచ్చినవాడికుందో చూపించండి...'అంది హృదయం లోంచి దొర్లి వస్తున్న అభిమానంతో.

'అదంతా నీకు నామీదఉన్న అభిమానం తప్ప ఈ రోజుల్లో అదంతా ఎవరిక్ కావాలి నీలూ . నీ పిచ్చిగానీ!... ఎలాగో అందరి కాళ్ళు పట్టుకుని, ఆశ్రయించి కాగితంమీద కనిపించే డిగ్రీ, క్లాసు, కావాలి. ఏర్పాటి ఏ మినిష్టరుగారి రికమండేషనో ఉంటే వాడి బ్రతుక్కి ఓ వెలుగు వస్తుంది అంతే'' అన్నాడు.

'మీరు మాత్రం! తల్చుకుంటే ఇంతకన్న ఎక్కువే సంపాదించగలరు—— పోండీ' అంది చనువుగా.

'అది సరేగానీ, ఈ ఎండాకాలం నాలుగు నెల్లనుండి నీవేం పుస్తకాలు మేశేసావేమిటి ?' 'అన్నాడు హాస్యంగా'.

'అవును, మరి మీలా చదువులే రావుగా నాకు, పుస్తకాలు తినాలిమరి ... మీరు అలాగే క్లాసులో పుస్తకాల పురుగు అని ఏడిపించేవారుగా' ... అంది బుంగ మూతిపెట్టి.

కేశవ నవ్వుతూ...'ఇంకా ఆ మాట నీకు జ్ఞాపకం ఉందా! నన్ను సమయం చూసి దెప్పుతున్నావు...'అన్నాడు కొంటెగా.

'ఛీ ... దెప్పట్లేదు నెమరువేసుకుంటున్నాను. చిన్నప్పటి మాటలు !' అంది మీనాల్లాటి నేత్రాలతో మిలమిలా చూస్తూ.

కేశవ దృష్టిని ఎటో మరల్చాడు. దగ్గరలోనే ఉన్న చిన్న చెరువులో నీటి కమలాలు సుధా కాంతులకు పరవశించి వికసించాయి. హృదయ పంజరాన్ని కదిలించాయి.

కేశవ హృదయంలో 'నీలకూడా అలాంటిదే' అని ఆలోచన మెరిసింది? 'ఎటువంటి చక్కని కుసుమం, ఎటువంటి స్థలంలో వికసించిందో' అని అనిపించింది.

'ఏమిటి ఆలోచిస్తున్నారు, అంత దీర్ఘంగా ఈ పరిసరాన్ని మీకథల్లో కావ్య వస్తువులుగా నిర్మించుకుందామనా ?' అంది.

'ఆ...నిజంగా అలాంటి మహాకవులకు ఇది కేంద్రంలాగే ఉంది. కాని నాలాంటి చిన్నవాడు ఈ ప్రకృతి సౌందర్యాన్ని ... చూసి ఆనందించవలసిందే కాని తనలో తన కవిత్వంలో ఇముడ్చుకోగలడా ?...'అన్నాడు.

"ఆ ... సరేకాని నీలా, ఇంక ఇంటికి పోదామా చీకటి పడుతోంది..."అన్నాడు.

'అప్పుడేనా! చూడండి చందమామ నీలి ముసుగు తెరలను తొలగించుకుని వచ్చాక చిరునవ్వును చూసి ఆనందించరూ?'

కేశవ నీల చిలిపి మాటలకి ఏదో బాధను లోపలే దాచుకుంటూ, చిన్నగా నవ్వుతూ ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆమె కనులలో నవ్వు పువ్వుల్లా వికసించింది ప్రేమజ్యోతి కనిపించింది. వెలుగుతోంది. విశాలమైన సోయగాలవంటి నేత్రాలు మీనాల్లాగ మిలమిలా ఓరగా చూచాయి. కేశవ దృష్టితో దృష్టిని కలిపాయి. అనుకోకుండా ఇద్దరి హృదయాలు కలిశాయి

కేశవ ఏదో తప్పు చేసినవాడిలా ఖిన్నుడై నిలిచాడు. 'మరి ఇంక పోదామా... సుధాకరుని అధరాలు నీలికలువతో కలిపావుగా'.

నీల మల్లెలు పరిమళించినట్లు నవ్వుతూ కూర్చొన్న తిన్నె మీద నుండి లేచింది.

'మీ నాన్నగారు ఎప్పుడు వస్తారు?'

'ఈ రాత్రికో రేపు ఉదయానికో రావచ్చు' అంది.

నీల చేతులను పదిలించుకుంటూ,— 'అన్నట్టు పోదాం, చీకటి పడితే తోటలో పాములు తిరుగుతాయి. మా నాన్న నన్ను ఎప్పుడు చీకటి పడ్డాక వాకిలిదాటి రానీయరు ఇక్కడ పాములు ఎక్కువ తిరుగుతాయి. అదుగో అప్పుడే మాలైలా వచ్చేస్తోంది. దానికి నేనంటే ఎంత ప్రేమో.. దాని వెనకాలే మా పుస్సీ కూడా వస్తోంది. వాటికి పాలుపోసే టైమ్ అయింది, అంటూ ఎదురుగా వచ్చిన చిన్న జాతి కుక్కపిల్లని ప్రేమగా పిల్చింది నీల. అది వచ్చి నీల ముఖం లోకి ఆకలేస్తోంది అన్నట్టుచూస్తూ ఛంగున భుజం మీదికి ఎక్కింది. వెనక్కాలే పుస్సీ మ్యావ్ అంటూ వచ్చి కాళ్ళకు చుట్టుకుంది.

'ఇంకేం, నీకు పిల్లులు కుక్కల పెంపకం బాగా తెలుసన్న మాట......'అంటూ ఆపేశాడు కేశవ.

'ఆపేస్తావేం...తర్వాతమాటకూడా...అంటే ఉద్దేశం... పిల్లల పెంపకం......కూ...డా...తెలుసా అనేగా? అది కూడ చూద్దువుగాని. రేపు ఆదివారం పిల్లలకు మా ఇల్లు కేంద్రం...... వస్తారు,..చూడు' అంది. తనకు పిల్లలన్నా, పిల్లులన్నా, కుక్కలన్నా.. కూడా ఇష్టమే అన్న సంతోషాన్ని సూచిస్తూ.

మర్నాడు ఉదయం కూడా సుబ్బయ్య రాలేదు. నీల, చంద్రి ఇంకా రాలేదని వీధిలోకి వెళ్ళి తొంగిచూచి వచ్చింది.

'ఏం, నీలా, మీ నాన్నగారు గేటుదాకా వచ్చి వెనక్కి వెళ్ళిపోతారేమో అనా భయం' అన్నాడు కేశవ హేళనగా.

'అబ్బే పూరికే వచ్చేవాళ్ళు వేళకి రాకపోతే అలా సహజంగా అనిపిస్తుంది'

ఇంతలో గంగమ్మ కాఫీ కప్పులు, మంచి ఇడ్లీలు ప్లేట్లలో పెట్టి తెచ్చింది. ఇద్దరూ ఇడ్లీ తిని కాఫీ తాగారు.

'ఇడ్లీ చట్నీ ఎలా ఉంది?'

'చాలా బాగుంది. మీ వంట మనిషి వంట బాగా చేస్తుందే' అన్నాడు




# శేషజ్యోత్స్న

( కవితా సంపుటి )

రచన : శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, ప్రతులకు : ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3237, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.

జామెట్రీ తెలియని వాళ్ళు లోనికి రాకూడదని ప్లేటో తన అకాడమీ ద్వారానికి ఒక బోర్డు వేలాడ దీశాడట. అటువంటి నిబంధనేదీ శేషజ్యోత్స్న అట్ట మీద లేకపోయినా కవిత్వం, దాని రహస్యం తెలిసిన కొద్ది మంది కోసం మాత్రమే నని గట్టిగా నమ్మే చాలామంది కవుల్లో శ్రీ శేషేంద్రశర్మ గారొకరు. ఈ పుస్తకము తెరవగానే మొదట నేనూ—నానెమలీ లేక నెమలీ—నానేనూ అనే పేరుతో కవి స్వయంగా రాసుకున్న ఉపోద్ఘాతమనే సాహిత్య చర్చ కనిపిస్తుంది. బోదిలేర్, కాళిదాసు, కాక్తో, మొపాసా, భవభూతి, వేమన, శ్రీశ్రీ మొదలైన విశ్వ విఖ్యాత సాహితీస్రష్టలంతా మనకు యిక్కడ కనిపించి మాట్లాడతారు. "ఒకసారి కవి మేలుకొన్నా డంటే వాడు పట్టి చపట—మేలుకొన్న కవి రాసే రాతలు చదవడం నిష్ప్రయోజనం" అంటాడు కాక్తో, 'కవికి మొట్ట మొదట కావలసింది సామాజిక స్పృహ (Social Consciousness) అని విశ్వ సిస్తున్న వర్తమాన కవి లోకం కాక్తోతో ఏకీభవించ నక్కర్లేదు. గుంటూరు శేషేంద్రశర్మగారి కవిత్వం సంఘం కోసం రాయబడింది కాదు. అది పూర్తిగా వ్యక్తిగత అనుభూతుల ప్రదర్శన. ఆయనలో ఆయనే పాడుకునేవైనా ఆయన గీతాలు మధురంగానే వుంటాయి. గట్టిగా అరవడం, చిరు నవ్వుతో మందలించడం, లోలోపల రగలడం మనకు ఈ కవిలో కనిపిస్తుంది. బంగ్లాదేశ్ విముక్తి వస్తువుగా తీసుకుని రాసిన కవిత 'పడవలు—తెరచాపలు' లో 'పూలరంగుల ఫిరంగులు ధీకొన్నాయి. పక్షుల గొంతుల్లో పాటను పుచ్చుకొని పారిపోయింది' రాత్రి అని ఆనాటి సంఘర్షణను, ప్రజల జీవితాలలో కరువైన శాంతిని కవి చక్కగా వ్యక్తీకరించారు. (ఈ పుస్తకంలో బయటి ప్రపంచం గురించి రాయబడిన కవిత యిదొక్కటే) 'నూతన తీరాలు' అనే కవితలో "జీవితాన్ని క్రాసుగా మనిషిని క్రైస్తుగా మలిచిన ఈ రోజు " అని చదువుతున్నప్పుడు దాదాపు రెండు దశాబ్దాల క్రితమే బెల్లంకొండ రామదాసు రాసిన పంక్తులు గుర్తొస్తాయి. (బ్రతుకే ఒక క్రాస్, మనిషే ఒక క్రైస్ట్—బెల్లంకొండ రామదాసు) 'చీకటి దయ్యాలు' అనే ఖండికలో మంచి పదచిత్రమే గీశారు శర్మగారు. సాయంత్రపు రక్తం త్రాగి, వికటాట్ట హాసం చేసే ఆకాశపు నోటిలో, భీకరదంష్ట్రి పంక్తులు, సితశోణిత నక్షత్రాలు. 'ఏవో చినుకులు' అనే కవితలో విధి నాయెదపై విరిసిన ఎర్ర గులాబీ అన్నప్పుడు బాగుందనుకుంటాము కానీ 'వెన్నెలలుమిసే విహాయసం' లోకి అన్నప్పుడు ఉమియడం, అందులో వెన్నెల్ని బాగాలేదు. శేషేంద్ర శర్మ గారి కవిత్వంలో విధి (లేక దైవం లేక ఒక మానవాతీత శక్తి) ప్రముఖంగా కనిపిస్తుంది. యూకలిప్టస్ అరణ్య సంచారమే కాని, మానవ జీవిత సమస్యారణ్యంలో ఈ కవి అడుగుజాడ కనబడదు. దీనికి కవి పుట్టి

దేవిప్రియ

పెరిగిన సామాజిక (ఆర్థికంగా సాంఘికంగా) వాతావరణమే కారణం కావచ్చు. "Where you come from is of very great importance" అంటాడు Robert Frost కొండ కోనలు, సముద్రాలు, సెలయేళ్ళు, అందమైన ప్రేమ దేవతల శిలా విగ్రహాలూ చూచి ఉత్తేజితులైనంతగా, శర్మగారు మానవుణ్ణి చూసి కావడం లేదనే నిర్ణయానికి శేషజ్యోత్స్న చదివిన ప్రతి ఒక్కరూ వచ్చి తీరుతారు. భావుకత, భాషమీద అధికారం, కలంలో సత్తువా వున్న ఈ కవి చూపులు నిరంతర సంఘర్షణలో, వేడిలో, కొలిమిలో యినుములా కాలుతున్న మనిషి మీదికి కూడా మళ్ళాలని ఆశ పడదాం.






# నగరాన్ని సందర్శించిన విదేశీ ప్రముఖులు

జెకొస్లవేకియా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం ప్రధాన కార్యదర్శి డా. గస్టావ్ హుసక్ డిసెంబరు 8 న హైదరాబాదుకు విచ్చేసినప్పుడు రాష్ట్ర గవర్నరు స్వాగతం పలికినప్పటి చిత్రం.

బల్గేరియా నేషనల్ అసెంబ్లీ అధ్యక్షులు డా. వ్లాడిమర్ బొనేవ్ నాయకత్వంలో బల్గేరియా పార్లమెంటరీ ప్రతినిధి వర్గం డిసెంబరు 21 న హైదరాబాదు విచ్చేసినప్పుడు ఆంధ్రప్రదేశ్ విధానసభ స్పీకర్ స్వాగతం చెప్పారు.





స్వయం ఉపాధి కల్పనా పథకం క్రింద ఋణాల మంజూరీకి తుదిరూపం యిచ్చేందుకు ఉద్దేశించిన ప్రత్యేక విభాగం సభ్యులు డిసెంబరు 13 న విజయవాడలో సమావేశమయ్యారు.

సమితి అధ్యక్షులు, శ్రీ డి. ఎస్. వి. వి. రామరాజుగారు అధ్యక్షత వహించారు. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలు గత 4 సంవత్సరాల నుండి వర్షాభావం చేత నీరు, పంటలు, పశుగ్రాసం లేక ఎక్కువ ప్రాంతాలవారు బాధపడు తున్నారనీ కనుక పన్నుల బకాయి వసూళ్లు, లెవీధాన్యం వసూళ్లు నిలిపి కరువు నివారణ పనులు ప్రారంభించ వలసిందిగా మంత్రి గారిని కోరారు.

జూట్ మిల్లు వర్కింగ్ ప్రసిడెంటు, శ్రీ ఆర్. నరసింహ రాజుగారు మంత్రి గారికి స్వాగత పత్రము సమర్పించారు.

## పిచ్చికల గుడిపాడులో హరిజన దినోత్సవము

ప్రకాశం జిల్లా కొరిశెపాడు పంచాయితీ సమితిలోని పిచ్చికల గుడిపాడు గ్రామంలో 30-12-73 వ తేదీన హరిజన దినోత్సవము జరుపబడింది. ఉదయం హరిజన వాడ పారిశుద్ధ్య కార్యక్రమము చేపట్ట బడింది. సాయంత్రము జరిగిన సభకు గ్రామ సర్పంచ్ శ్రీ అంజి రెడ్డి అధ్యక్షత వహించారు బ్లాకు పబ్లికు రిలేషను ఆఫీసరు శ్రీ పి నాగేశ్వరరావు విద్యా విస్తరణాధికారి శ్రీ జె. వేంకటేశ్వర్లు, ముఖ్యసేవిక శ్రీమతి వెంకాయమ్మ గార్లు హరిజన దినము యొక్క ప్రాముఖ్యతను గూర్చి వివరించి ప్రభుత్వము హరిజనులకై ప్రత్యేకముగా చేయుచున్న కార్యక్రమములను గూర్చి వివరించారు. గాంధీజీ ఆశయమైన అస్పృస్యతా నివారణకు అందరూ కలిసికట్టుగా కృషి చేయాలని ఉద్బోధించారు, ఈ సందర్భముగా ఏర్పాటు చేయ బడిన ఆటల పోటీలు శుభ్రమైన యిల్లు, ఆరోగ్యమైన పిల్లలు పోటీ లలో గెలుపొందినవారికి బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ కె.యల్ నరసింహస్వామి బహుమతులను పంచిపెట్టారు.

## సంగారెడ్డిలో పోలీసు క్లబ్బుకు శంకుస్థాపన

ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ శ్రీ అబ్దుస్ సలాంఖాన్ జనవరి 6వ తేదీన సంగారెడ్డిలో పోలీసు క్లబ్బుకు శంకుస్థాపన జరిగిన సందర్భంలో ప్రసంగిస్తూ పోలీసులు 1969, 1972 ఆందోళనలలో తమ కర్తవ్యాన్ని ప్రశంసార్హంగా నిర్వర్తించారని చెప్పారు. పోలీసుల గృహ నిర్మాణ పథకం క్రింద పోలీసుశాఖ రూ. 3 కోట్లు ఖర్చుపెడుతున్నదని ఆయన తెలిపారు.

డి.ఐ.జి. శ్రీ శ్రీనివాసన్ ప్రసంగిస్తూ, పోలీసులకు ఇతోధిక సౌకర్యాలు కల్పించడం వల్ల పోలీసుశాఖ సామర్థ్యం మెరుగు పడగలదని చెప్పారు. జిల్లా కలెక్టరు శ్రీ మొహమ్మద్ మహా




పతాక దినోత్సవ సందర్భంగా కడపలో డిసెంబరు 7వ తేదీన ఇన్‌ఛార్జి కలక్టరు, జిల్లారివెన్యూ ఆఫీసరూ సభలో ప్రసంగించారు.

బూట్ అలీ ప్రసంగిస్తూ, సమాజంపట్ల పోలీసుశాఖకు గురుతరమైన సామాజిక బాధ్యత ఉన్నదని చెప్పారు. శాసన సభ్యులు శ్రీ పి. రామచంద్రారెడ్డి తమ అధ్యక్షోపన్యాసంలో సంగారెడ్డిలో పోలీసు క్లబ్బు నిర్మాణం విషయంపై శ్రద్ధాసక్తులతో కృషిచేసినందుకు పోలీసు సూపరింటెండెంటు శ్రీ జగన్మోహన్‌ను అభినందించారు.

అంతకుముందు శ్రీ పి. జగన్మోహన్ అతిథులకు స్వాగతం చెబుతూ, పోలీసు క్లబ్బుకు రెండంతస్థుల భవనం వుంటుందనీ, అందులో దుకాణాలు, నివాస గదులకు ఏర్పాట్లు వుంటాయని చెప్పారు. వాటివల్ల వచ్చే అద్దెల ఆదాయంతో క్లబ్బును నిర్వహించడం సుకరమవుతుందనీ, భవన నిర్మాణానికి ఒక లక్ష రూపాయలు ఖర్చు కాగలవని అయన తెలిపారు. శ్రీ బాజ్‌పాయ్ వందన సమర్పణ చేశారు.

## 37 నివేశన స్థలాల పట్టాల పంపిణీ

నెల్లూరు జిల్లా, కొవ్వూరు సమితి అధ్యక్షులు శ్రీ కె. వేంకటరామారెడ్డి చౌటుపత్తేడులో డిసెంబరు 30వ తేదీన హరిజన దినోత్సవ సందర్భంగా ఆ గ్రామంలో 37 మంది హరిజనులకు నివేశన స్థలాల పట్టాలు పంచిపెట్టారు. ఈ సందర్భంలో ఏర్పాటైన సభలో కొవ్వూరు తహశీల్దారు శ్రీ పి. వి. సుబ్బారెడ్డి ప్రసంగించారు. హరిజన దినోత్సవ సందర్భంగా ఆరోగ్యవంతులైన పసిపాపల ఎంపిక కొరకు పోటీలు నిర్వహించబడ్డాయి. పరిశుభ్రంగా ఉంచబడిన ఇండ్లలో ఉత్తమమైనవాటిని ఎంపిక చేయడానికి కూడా ఒక పోటీ నిర్వహించబడింది. ఈ పోటీలలో గెలుపొందిన వారికి సమితి అధ్యక్షులు బహుమతులు పంచిపెట్టారు. బి.డి.ఓ. శ్రీ యం. ఏనాద్రి, విస్తరణ శాఖాధికారిణి శ్రీమతి పరిమళగారలు ప్రసంగించారు. గ్రామ సర్పంచ్ శ్రీ జి. నరసప్పనాయుడు అతిథులకు స్వాగతం చెప్పారు.

## విజయవాడలో యాత్రిక విశ్రాంతి గృహం

యాత్రిక విషయాలు, పౌర గ్రంథాలయాల శాఖామంత్రి డా॥ సి హెచ్. దేవానందరావు విజయవాడలో ప్రసంగిస్తూ, కేంద్ర సహాయంతో విజయవాడలో యాత్రిక విశ్రాంతి గృహాన్ని నిర్మించే ప్రతిపాదన పునః పరిశీలించడం జరుగుతుందని చెప్పారు. వనరులు పరిమితంగా మాత్రమే లభ్యమవుతున్నప్పటికీ, రాష్ట్రంలో యాత్రా విషయాల అభివృద్ధికై ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలను వివరించి చెప్పారు. వివిధ వర్గాలమధ్య సదవగాహనను పెంపొందించేందుకు విదేశీయాత్రా విషయాలు ఎంత ముఖ్యమైనవో, దేశీయ యాత్రా విషయాలు కూడా అంత ముఖ్యమైనవని ఆయన అన్నారు. రాష్ట్రంలో దర్శనీయమైన స్థలాలకు తగిన ప్రచారం జరుగడంలేదు గనుక జర్నలిస్టులు యాత్రాస్థలాలకు తగిన ప్రచారం ఇచ్చే విషయంలో వారి సహకారాన్ని ఆయన అర్థించారు.

ప్రతి గ్రామంలో నాలుగు దేవాలయాలు అంటే, దేవునిగుడి, ఒక పాఠశాల, ఒక్క ఆసుపత్రి, ఒక గ్రంథాలయం వుండవలసిన

అవసరం ఎంతైనా వుంది. దురదృష్టవశాత్తు సెస్సురూపంలో లైబ్రరీ అధికారులు విడుదల చేస్తున్న డబ్బు, సిబ్బంది జీతాలు, అలవెన్సులకే సరిపోవడంలేదని మంత్రి అన్నారు. గ్రంథాలయోద్యోగుల సర్వీసులను ప్రభుత్వపరం చేస్తేగాని, వారి సమస్యలు శాశ్వతంగా పరిష్కారం కాజాలవని ఆయన చెప్పారు. గ్రంథాలయ ఉద్యోగులకు రావలసిన బకాయిల విషయమై తగిన చర్య తీసుకోవడం జరుగుతుందని ఆయన హామీ ఇచ్చారు. ప్రెస్ క్లబ్‌కు ఒక గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయడానికి రూ. 5,000 ల గ్రాంటు ఇవ్వడం జరుగుతుందని ఆయన హామీ ఇచ్చారు. ప్రెస్ క్లబ్ కార్యదర్శి శ్రీ ఎ. ఆంజనేయులు మంత్రికి స్వాగతం చెప్పారు. ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు క్లబ్బు అధ్యక్షులు శ్రీ విశ్వేశ్వరరావు అధ్యక్షత వహించారు.

మద్రాసు, కలకత్తా మ్యూజియంలకు తరలించబడిన అమరావతి శిల్పాలను తిరిగి తెప్పించాలని, కొండపల్లిని అభివృద్ధిపరచాలని శ్రీ బి. యస్. బంగారయ్య మంత్రికి విజ్ఞప్తి చేశారు.

## అచ్చంపేటలో క్రీడాకారులకు బహుమతుల పంపిణీ

మహబూబ్‌నగర్ జిల్లా అచ్చంపేటలో డిసెంబరు 31న తాలుకా స్థాయిలో జరిగిన ఆటల పోటీలలో గెలుపొందిన క్రీడాకారులకు సమాచార, పౌరసంబంధ శాఖ మంత్రి శ్రీ మొహమ్మద్ ఇబ్రాహీం అలీ అన్సారీ బహుమతులు పంపిణీ చేస్తూ, పోటీలలో గెలుపొందిన వారిని అభినందించారు. ఆదిమజాతుల విద్యార్థులుకూడా యీ పోటీల్లో పాల్గొన్నందుకు తమ హర్షం వెలిబుచ్చారు. ఈ సందర్భంలో ఏర్పాటయిన సభకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. కె. రెడ్డి అధ్యక్షత వహించారు. ఆదిమజాతుల విద్యార్థులు ఉత్సాహంగా పోటీల్లో పాల్గొన్నందుకు వారిని జిల్లా పరిషత్తు అధ్యక్షులు అభినందించారు. అచ్చంపేట పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ యం. గోపాలరెడ్డి స్వాగతోపన్యాసం చేస్తూ, యీ పోటీల్లో 128 జట్లు, 1022 మంది క్రీడాకారులు పాల్గొన్నారని చెప్పారు.

## హోటల్ 'విక్రమ్'కు యాత్రికశాఖా మంత్రి ప్రారంభోత్సవం

యాత్రికశాఖ మంత్రి డా. దేవానందరావు జనవరి 14న విశాఖపట్నంలో అనేక అంతస్తులతో కూడిన ఆధునిక హోటల్ 'విక్రమ్'కు ప్రారంభోత్సవం చేస్తూ యాత్రా వ్యవహారాలలో ముఖ్య భాగమైన హోటల్ పరిశ్రమ, వాణిజ్య సరళిలో గాక సేవాభావమే ప్రధాన లక్ష్యంగా ఉంచుకుని స్వదేశీ, విదేశీ యాత్రికుల అవసరాలు తీరుస్తూ భారతీయ సంస్కృతి సంప్రదాయాలను ప్రతిబింబింపజేయాలని అన్నారు. విశాఖపట్నం ప్రముఖ యాత్రా కేంద్రంగా అభివృద్ధి చెందుతున్నది. వివిధ రకాల యాత్రికుల అవసరాలను, తగిన వసతి సమస్యలను తీర్చే విధంగా యితర సౌకర్యాలు కూడా పెరుగుతున్నాయని ఆయన అన్నారు.

## ఆలేరులో మహిళా వ్యవసాయకూలీలకు శిక్షణ

నల్గొండ జిల్లా సూర్యాపేటలోని రైతు శిక్షణ కేంద్రం వారు, ఆలేరులో యిటీవల 26 మంది మహిళా వ్యవసాయ కూలీలకు 5 రోజులపాటు శిక్షణాకార్యక్రమాన్ని నిర్వహించారు. వ్యవసాయం, పశుపోషణ పౌష్టిక ఆహారం, పసిపిల్లల సంరక్షణ విషయాలలో వారికి శిక్షణ యిచ్చారు. వ్యవసాయం, గృహవిజ్ఞాన శాస్త్రాలకు సంబంధించిన ప్రదర్శనను ఏర్పాటుచేశారు.

## కరీంనగర్ సమితిలో 249 హరిజన గృహాల నిర్మాణం

జీవిత బీమాసంస్థ గృహ నిర్మాణ పథకం క్రింద కరీంనగర్ సమితిలో 8 గ్రామాలలో మంజూరైన 278 యిండ్లలో 249 యిండ్లను యింతవరకు నిర్మించారు. వాటి నిర్మాణానికి రూ. 1,18,200లు ఖర్చు చేశారు. మిగతా 29 యిండ్ల నిర్మాణం చురుకుగా కొనసాగుతున్నది.

## 51 మంది మత్స్య పారిశ్రామికులకు రు. 11,346లు విలువచేసే నైలాన్ దారంపంపిణీ

శ్రీకాకుళం జిల్లా కలక్టరు శ్రీ ఎ. మునివెంకటప్ప, యిటీవల శ్రీకాకుళం జిల్లా, కోటబొమ్మాళి సమితిలోని మాదలేశం, మరువాడ, అట్టవానిపేట, కుల్లవానిపేట, పాతమేఘవరం, ఉమిలాడ, గుప్పిడిపేట గ్రామాలకు చెందిన 51 మందిమత్స్య పారిశ్రామికులకు, రు 11,346 ల విలువ చేసే నైలాన్ దారం పంపిణీ చేశారు.

## మహబూబ్‌నగర్‌లో ఆటల పోటీలు

మహబూబ్‌నగర్‌లోని మూడవ లాల్‌బహదూర్ వాలీబాల్, బాల్‌బాడ్మింటన్ టోర్నమెంట్ సంఘం వారు యిటీవల మహబూబ్‌నగర్‌లోని మునిసిపల్ మైదానంలో ఆటలపోటీలను నిర్వహించారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు, శ్రీ కె. కె. రెడ్డి, కలక్టరు పి. ఎ. శ్రీ కె. ఎఫ్. ఎ. అన్సారీ, పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ కె. రామకృష్ణారెడ్డి తదితరులు సమావేశంలో ప్రసంగించారు.

ఆ తర్వాత జిల్లా పరిషత్తు అధ్యక్షులు, శ్రీ కె. కె. రెడ్డి విజేతలకు బహుమతులు ప్రదానం చేశారు.

## రు. 3 లక్షల ఖర్చుతో కాలువల మరమ్మత్తు

గుంటూరు జిల్లా కలక్టరు, శ్రీ కె. చంద్రయ్య జనవరి 27న పత్తూరులో మాట్లాడుతూ ఈ పంటల కాలంలో రు. 3 లక్షల ఖర్చుతో ఆంధ్రరత్న పంపింగ్ పథకంలో కాలువలను మరమ్మత్తు చేస్తారని అన్నారు. ఈ సంవత్సరం 60 హెచ్. పి. ల పంపింగ్ ప్రవేశపెట్టారు. ఆఖరులో ఉన్న భూములకు నీరు సరఫరా జరగడానికి వీలుగా పంపులస్థాయిని పెంచుతారని ఆయన అన్నారు.

పెనాల్టీలను రద్దు చేయాలని రైతులు, కలక్టరుకు విజ్ఞప్తి చేశారు. భూమి శిస్తు బకాయిలన్నిటిని చెల్లించే పక్షంలో పెనాల్టీలను రద్దు చేస్తారని కలక్టరు హామీ యిచ్చారు.







PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS & TOURISM ANDHRA PRADESH, HYDERABAD.

